# బొమ్మరిల్లు

సంపాదకుడు: విజయ బాపినీడు

చెడుబుద్ధులున్నవారు సదా నేరం చేస్తూ, మంచివారిని మోసం చేస్తూంటారు. అలాంటి వారికి తగినశిక్ష పడి తీరాలని చింతిస్తూ, మంచివారు తమ మనస్సును వృథాగా పాడుచేసుకుంటూంటారు. ప్రపంచం ఒక పద్ధతిలో నడుస్తుంది. మనిషికి మనిషి ఇబ్బంది కలిగిస్తే దాన్ని నివారించేందుకు ఎన్నో సదుపాయాలున్నాయి. తప్పు చేసినవారిని పట్టు కుందుకు రక్షకభటులున్నారు. శిక్షించడానికి న్యాయాధికారు లున్నారు. శిక్ష అనుభవించటానికి కారా గృహాలున్నాయి. వీటన్నింటినీ తప్పించుకున్నవారిని దేవుడు విడిచి పెట్టడు. అందువలన నేరస్తులకు శిక్షపడలేదని బాధ పడేవారు తమ మనస్సులలో పరోపకార బుద్ధిని పెంచు కుంటే మనస్సు సంతోషం కలిగి, హాయిగా జీవితం గడపగలరని ఈ సంచికలో శ్రీమతి వసుంధర గారి రచన 'ఉన్నవీ - లేనివి' కథ ఒక మంచి ఉదాహరణ.

సంపుటి: 25 జూన్ 1996 సంచిక: 8

విడిప్రతి: రూ. 5-00 సంవత్సర చందా: రూ. 60.00

## తెల్ల మచ్చలు

అత్యంత శీఘ్రంగా ప్రభావశీలియైన మందుతో తెల్ల మచ్చ రంగు మారి, నెమ్మదిగా శరీరం రంగులో, మచ్చ లేర్పడు కారణం దూరం చేస్తూ, కల్సిపోవును. పరీక్షించుటకు 7 రోజుల మందు ఉచితంగా పంపుతాము. మిగిలిన వైద్యాలతో విసుగు, నిరాశ చెందితే, మాకు రోగి వయస్సు, మచ్చల వివరాలతో వ్రాయండి.

## జుట్టు తెల్లబడుట, రాలుట

చిరు ప్రాయంలో జుట్టు తెల్లబడుట, రాలుటకు విలువైన వనమూలికలతో తయారు చేయబడిన మందు కలదు. నల్లని ఒత్తైన జుట్టు దట్టముగా పెరిగి, జ్ఞాపకశక్తి పెరిగి, మెదడును చల్లబర్చును. రోగి వయస్సు, వివరాలతో తెల్పండి.

**SHYAM AYURVED BHAVAN (SB-8)**

**P.O. Katri Sarai (Gaya) - 805105**

**50 సంవత్సరాలుగా ప్రజల సేవలో**

వార్తలు-విశేషాలు

# కథ మారాలి-కథానాయకులు మారాలి

అతడి పేరు జువాన్ గార్సియా అబ్రెగో. వయసు యాభై ఒకటి. టెక్సాస్‌లోని లాపలోమాలో పుట్టిన అమెరికన్ పౌరుడు. కొన్నాళ్ళు సీదాసాదాగా బ్రతికాడు. నచ్చలేదు. మూడుపదుల వయస్సులో కార్ల దొంగతనం ప్రారంభించాడు. అక్కడ కాజేసి పొరుగుదేశంలో అమ్మేవాడు.

ఈలోగా అతణ్ణి మెక్సికో దేశంలోని మాదకద్రవ్యాల వ్యాపారం ఆకర్షించింది. లాభాలకు లాభాలు. సాహసానికి సాహసం. చుట్టుపక్కల దేశాల్లో ఈ వ్యాపారానికి ఆటంకాలు పెరిగాయి. అందుకని మెక్సికో దీనికి కేంద్ర బిందువైంది.

అబ్రెగో ఈ వ్యాపారంలో ప్రవేశించి ఊరుకోలేదు. ఉన్నతస్థాయికి ఎదిగాడు. ఉన్న ఒకే ఒక్క పోటీదారును చంపేసి తనే నాయకుడయ్యాడు. టన్నుల కొద్దీ కొకైన్, మారిజువానా వగైరా మాదక ద్రవ్యాలను అమెరికాకు జేర్చాడు. అమెరికాకు వచ్చే కొకైన్లో 70 అబ్రెగోవల్లనే చేరుతున్నది.

మాదకద్రవ్యాలు మనిషికి తాత్కాలికంగా ఆనందపు భ్రమను కలిగిస్తాయి. అలవాటయ్యాక వాటిని వదిలిపెట్టడం కష్టం. వాటి ఖరీదూ ఎక్కువే! అలవాటుపడ్డవాడు వాటి కోసం ఉన్న ఆస్తినంతా అమ్ముకుంటాడు, దొంగతనాలు చేస్తాడు, హత్యలు చేస్తాడు. ఇన్నీ చేసి సుఖపడలేడు. ఆరోగ్యం పాడవుతుంది. మనశ్శాంతి కరువౌతుంది. అకాలంలో ముసలితనం వస్తుంది. చివరకు తాగుబోతుకంటే దిక్కుమాలిన చావు చస్తాడు.

అజ్ఞానం, అమాయకత్వం వల్ల మనుషులు మాదక ద్రవ్యాలకు అలవాటుపడి తర్వాత

ఈ శతాబ్దపు చివరి దశాబ్దం

వాటికి బానిసలవుతారు. అమెరికా వంటి సంపన్న దేశాల్లో తలిదండ్రుల ప్రేమకు నోచుకోని బాలలు, యువకులు కొందరు వాటికి అలవాటుపడి తమ జీవితాలను చిన్న వయసులోనే నాశనం చేసుకుంటున్నారు. అందుకని ఆ ప్రభుత్వం వాటిని నిరోధించడానికి శాయశక్తులా ప్రయత్నిస్తోంది.

జువాన్ గార్సియా అబ్రెగో గురించి పోలీసు అధికారులకు తెలుసు. అతణ్ణి పట్టుకుంటే మాదక ద్రవ్యాల రవాణా ఆగినట్లేనని వారి భావన. అందుకే అతణ్ణి పట్టిచ్చిన వారికి రెండు మిలియన్ల డాలర్లు అంటే ఏడుకోట్ల రూపాయలు బహుమతిగా ప్రకటించారు.

జనవరి 15, 1996 రాత్రి మెక్సికన్ పోలీసులు అబ్రెగోను పట్టుకున్నారు. వెంటనే అమెరికాకు అప్పజెప్పారు.

దీనితో మాదకద్రవ్యాల వ్యాపారం, రవాణా ఆగిపోతాయా?

ఆగవు. ఎందుకంటే —

తన తల విలువ ఏడుకోట్ల రూపాయలని తెలియగానే అబ్రెగో కంగారుపడి తప్పించుకుని తిరగడం మొదలుపెట్టాడు. వెంటనే అతడి స్థానాన్ని అమాడో కర్రిల్లో ఫ్యూయెంటెస్ తీసుకున్నాడు. అతడి వయసు 39 సంవత్సరాలే! ఈ వ్యాపారంలో, రవాణాలో అబ్రెగోను మించినవాడని అభిజ్ఞుల అంచనా!

అబ్రెగో, ఫ్యూయెంటస్‌లు నరరూపరాక్షసులు. మానవజాతి యావత్తూ ద్వేషిస్తే తప్ప వారు చావరు.

ఇదివరలో పాబ్లో ఎస్కోబార్. అతగాడు అప్పుడప్పుడు నరదాక్కూడా హత్యలు చేసేవాడు. అతడుపోయి అబ్రెగో వచ్చాడు. అబ్రెగోపోయేలోగానే ఫ్యూయెంటస్ తయారయ్యాడు.

వీళ్ళిలా ఎక్కణ్ణించి పుట్టుకు వస్తున్నారు?

అబ్రెగో మానవజాతికి శత్రువే కావచ్చు. కానీ అతడి జీవితాన్ని సినిమాగా తీస్తే మన అభిమాన హీరో ఆ వేషం వేస్తాడు. ఆ వేషం కొత్తవాడు వేస్తే మన అభిమాన హీరో అవుతాడు.

అబ్రెగో కథలో అతడు నాయకుడు కాకూడదు. ఆ పాత్రను కథానాయకుడిగా మలిచే వేషగాళ్ళను మనమాదరించకూడదు. ఎందుకంటే వాళ్ళే మరెందరో అబ్రెగోలు తయారవడానికి స్ఫూర్తి అవుతున్నారు.

రానున్న శతాబ్దంలో — అది నవలైనా, సినిమా అయినా — కథ మారాలి — కథానాయకులు మారాలి — అని ఈ శతాబ్దపు చివరి దశాబ్దంలో ఆశిద్దాం.

— "వసుంధర"



# వీరదాసు-యుద్ధం

స్వర్ణపురి రాజధానిలో వీరదాసు అనే యువకుడుండేవాడు. వాడికి చదువు రాలేదు కానీ యుద్ధ విద్యలలో మంచి సామర్థ్యముండేది. పోటీల్లో ఎలాంటి వీరుడినైనా ఓడించేవాడు. వాడి సామర్థ్యం చూసి ఒక ధనికుడు వాణ్ణి తన ఇంటి కాపలాకు నియమించాడు.

అలా కొన్నాళ్ళు బాగానే గడిచింది. ఒకరోజు ధనికుడింట్లో దొంగ ప్రవేశించాడు. వీరదాసు వాడినాపబోతే కత్తిచూపి బెదిరించాడు. వీరదాసు బెదిరిపోయి పారిపోయాడు. దొంగ తన పని చేసుకుని వెళ్ళాడు. ధనికుడు వీరదాసు ఉద్యోగం పీకేశాడు.

"నాయనా! నీ వద్ద కత్తి ఉంటే, నిన్నెవ్వరూ ఎదిరించలేరు. దొంగకెందుకు భయపడ్డావు?" అని తండ్రి వీరదాసుని అడిగాడు.

"పోటీలో అయితే నేను దొంగను ఓడించగలను. కానీ ఇది పోటీ కాదు. ప్రాణాలకు తెగించిన దొంగ నా ప్రాణాలు తీయగలడని భయపడ్డాను" అన్నాడు వీరదాసు ఉన్న మాట చెబుతూ.

"నువ్వు పిరికివాడివి. నీ వంటివాడు సైన్యంలో చేరడం మంచిది. బోలెడు జీతం దొరుకుతుంది" అన్నాడు వీరదాసుతో తండ్రి.

"అమ్మో - సైన్యంలో చేరితే యుద్ధం చేయాలి. అక్కడ పోరాటం గెలువు కోసం. ప్రాణాలు తియ్యాలి! నేను సైన్యంలో చేరను" అన్నాడు వీరదాసు.

"వెర్రివాడా! ఇప్పుడు ప్రపంచ దేశాలన్నీ శాంతిని కోరుతున్నాయి. ఇప్పట్లో యుద్ధ భయంలేదు. సైన్యంలో చేరి సుఖపడడానికిదే మంచి తరుణం" అన్నాడు వీరదాసు తండ్రి.

వీరదాసు సేనాధిపతిని కలుసుకుని తన శక్తి సామర్థ్యాలు ప్రదర్శించాడు. ఆయన వెంటనే వాడిని సైన్యంలో జేర్చుకున్నాడు. వీరదాసు దురదృష్టమో ఏమో - కొద్దికాలంలోనే పొరుగు రాజుతో స్వర్ణపురికి యుద్ధం వచ్చింది.

"ఇప్పుడేం చేయను?" అని వీరదాసు తండ్రి

ఎన్. శివనాగేశ్వరరావు

వద్ద వాపోయాడు.

"పిరికితనం పనికిరాదు. యుద్ధానికి వెళ్ళు" అన్నాడు తండ్రి.

"పిరికితనం పోకుండా యుద్ధం చేసేదెలా?" అన్నాడు వీరదాసు.

"నీదంతా నీ తాత పోలిక. ఆయనకూ చదువు రాక సైన్యంలో చేరాడు. యుద్ధం వస్తుందేమోనని హడిలిచస్తూండేవాట్ట. యుద్ధం రానేవచ్చింది. ఏం చేశాడో తెలుసా - యుద్ధ భూమిలో సైనికుల శవాల మధ్య తానూ ఒక శవంలా పడుకుని పోయాట్ట. అంతే పిరికితనం ఎగిరిపోయిందట" అన్నాడు వీరదాసు తండ్రి

ఈ ఉపాయం బాగుందనుకున్నాడు వీరదాసు.

యుద్ధం మొదలయింది. వీరదాసు శత్రు సైనికుల చేతికందకుండా తప్పించుకుంటూ వీలు చూసుకుని ఒక చోట పక్కవేశాడు. "హమ్మయ్య!" అని మదిలో నిట్టూర్చాడు. అంతలో నలుగురు సైనికులలా వచ్చి వాణ్ణి తన్నుకుంటూ వెళ్ళారు. ఆ తర్వాత ఓ ఇద్దరు సైనికులు పరుగెడుతూ వాణ్ణి తొక్కుకుని వెళ్ళారు. వీరదాసుకి ప్రాణం గిలగిలలాడేంతలో ఒక ఏనుగు ఘీంకారం వినపడింది. అది తనవైపే వస్తోందని వాడికి అర్థమయింది.

తనకు చావెలాగూ తప్పదని వీరదాసుకి అర్థమయింది. శవంలా పడుకుని క్షణం క్షణం భయపడుతూ చచ్చేకంటే - వీరోచితంగా పోరాడి వీరమరణం చెందడం ఉత్తమమని వాడికి తోచింది. అంతే - రివ్వున లేచాడు. చివాలున కత్తి దూశాడు. శత్రు సైనికుల్ని ఊచకోత కోశాడు. వాడి చండప్రచండ యుద్ధం శత్రుసైనికుల్ని వణికించింది. తోటి సైనికుల్ని ఉత్తేజపరచింది.

స్వర్ణపురి విజయం సాధించింది. రాజు వీరదాసును ప్రత్యేకంగా మెచ్చుకున్నాడు.

వీరదాసుకు యుద్ధమంటే ఉత్సాహం పుట్టింది. కానీ దురదృష్టవశాత్తూ వాడి జీవితంలో మళ్ళీ యుద్ధం రాలేదు.







# సాధకుడు

మహారాజు రవిచంద్రుడు తన ధనుర్దళాన్ని పటిష్టపరచాలనుకున్నాడు. దళపతి నియామకానికి చాటింపు వేయిస్తే నగర ప్రాంతం నుండి శివదత్తుడు, అడవుల్లోంచి కోనసింగన్న వచ్చారు. వారిద్దర్నీ వేర్వేరు గదులలో విశ్రమింపజేసి ప్రశ్నలు వేయడానికి మంత్రిని పంపాడు రవిచంద్రుడు.

ముందు శివదత్తుడి వంతు వచ్చింది. విల్లునెలా తయారుచేస్తారని అడిగాడు మంత్రి.

"ఇనుము, రాగి, వెండి, బంగారం కలిసిన మిశ్రమ లోహంతోగానీ, అడవిదున్న, దుప్పి కొమ్ములతో కానీ విల్లును చేయవచ్చు. కానీ ఎక్కువగా పండు వెదురుతో తయారుచేస్తారు" అన్నాడు శివదత్తుడు.

విల్లు పొడవెంతని మంత్రి అడిగితే — ఉత్తమ ధనుస్సు పొడవు ఎనిమిదడుగులుండాలని చెప్పాడు శివదత్తుడు.

అప్పుడు మంత్రి, "ఉత్తమ ధనుస్సు లక్షణాలేమిటి?" అన్నాడు.

"బలమైన విల్లువల్ల శరవేగం తగ్గదు. ఆకర్ణాంతం లాగినప్పుడు జవజవలాడకుంటే గురి తప్పదు. ఏక కణుపు కర్ర వాడితే లక్ష్యం దుర్లభమవుతుంది. విల్లు చివర కణుపులుంటే పోరులో అపజయం తప్పదు —" అన్నాడు శివదత్తుడు.

"ధనుర్విద్యలో గురువు శిష్యుడికి చెప్పే ప్రథమ పాఠమేమిటి?" అన్నాడు మంత్రి.

"ఏకాగ్రత. అది కుదరడానికి ములుకులేని శరాలతో లక్ష పుష్పాల్ని ఛేదించే వరకూ అభ్యాసం చేయాలి. లోహపు అలుగు బాణాలతో నీటి లోపలి చేపల్ని కొట్టి పట్టాలి" అని వివరించాడు శివదత్తుడు.

తర్వాత మహామంత్రి కోనసింగన్నను కూడా ఇవే ప్రశ్నలు వేస్తే వాడు నిర్దుష్టమైన సమాధానమివ్వలేకపోయాడు. చివరగా వాడు, "అయ్యా! నన్ను విల్లు తయారు చేయమనండి. చేస్తాను. గురి చూసి కొట్టమనండి కొడతాను. ఇలాంటి ప్రశ్నలు మాత్రం అడగొద్దు" అన్నాడు.

మాధవరపు కృష్ణ

మంత్రి వెళ్ళి రాజుకు జరిగింది చెప్పాడు.

తర్వాత శివదత్తుడికీ, కోనసింగన్నకూ ధనుర్విద్యలో పోటీ జరిగింది. అన్నింట్లోనూ ఇద్దరూ సమఉజ్జీలుగా కనబడ్డారు. శివదత్తుడు మాత్రం కాస్త అలిసినట్లు కనిపించాడు. కోనసింగన్న చెక్కు చెదరలేదు.

అప్పుడు రవిచంద్రుడు విలుకాండ్రిద్దర్నీ తన వద్దకు రమ్మని వారి అరచేతులు చూపమన్నాడు. శివదత్తుడి చేతులు నాజూగ్గా ఉన్నాయి. కోనసింగన్న చేతులు కాయలు కాసి ఉన్నాయి.

"నీ చేతులిలా ఉన్నాయేం?" అన్నాడు రవిచంద్రుడు.

"ప్రభూ! నేను ప్రతిరోజూ ఎంతోసేపు విలు విద్యా సాధన చేస్తూంటాను" అని కోనసింగన్న వినయంగా బదులిచ్చాడు.

"దళపతి నిత్యసాధకుడై ఉండాలి. అటువంటి వాడే ఎలాంటి విపత్కర పరిస్థితిలోనైనా అలుపూ సొలుపూ లేక విల్లును వాడగలడు. కాబట్టి కోనసింగన్నను దళపతిగా నియమిస్తున్నాను" అన్నాడు రవిచంద్రుడు.

అప్పుడు మంత్రి, "ప్రభూ! సాధన తక్కువగా ఉన్నప్పుడే శివదత్తుడు కోనసింగన్నతో సమఉజ్జీ అయినాడు. మరికాస్త సాధన చేస్తే అతడు కోనసింగన్నను మించిపోగలడు తమరీ విషయం మరువకూడదు" అన్నాడు.

రవిచంద్రుడు నవ్వి, "శివదత్తుడి ప్రతిభకు కారణం శాస్త్రజ్ఞానం. కోనసింగన్న ప్రతిభకు కారణం సహజశక్తి, అపార సాధన. సాధకుడిని జ్ఞానంతో జయించడం కష్టం. సాధకుడికి సాధకుడే సాటి. శివదత్తుడు సాధకుడు కాలేడు. అతణ్ణి శాస్త్ర శిక్షణకూ, ధనుర్నిర్మాణానికీ అధిపతిగా నియమిస్తున్నాను" అన్నాడు.

శివదత్తుడది తనకు తగిన పదవి అని సంతోషించాడు. వాడి శిక్షణలో కోనసింగన్న మరింత ప్రతిభావంతుడై - తన ధనుర్దళాన్ని లోకభీకరంగా తీర్చిదిద్దాడు.






19

(గత సంచిక తరువాయి)

పాంచాల బ్రాహ్మణుడి ప్రసంగం ఇలా కొన సాగింది.

"ద్రోణుడు తనను తూలనాడి విడిచిపెట్టిన తర్వాత మా మహారాజు అవమానభారంతో పాంచాలపురానికి తిరిగివచ్చాడు. నిద్రాహారాలు, రాచకార్యాలు విడిచిపెట్టి, రాత్రింబవళ్ళు అవమాన దుఃఖంతో కుమిలిపోసాగాడు.

మంత్రులు ఆ దుఃఖం నుంచి తమ ప్రభువుకు స్వస్థత చేకూర్చటానికి ఎన్నో ప్రయత్నాలు చేశారు. చివరకు పురోహితులను రప్పించి, వారి చేత చెప్పించారు. అందరూ బ్రతిమాలుకోగా -

"హితులారా! మీరంతా ఎంత చెప్పినా నాలో రగిలే అగ్ని చల్లారదు. నిజంగా నా దుఃఖం ఉపశమించబడాలంటే, నన్ను నిర్జించిన జగదేక వీరుడైన అర్జునుణ్ణి భర్తగా పొందగలిగిన కూతురు, నన్ను అవమానించిన ద్రోణుణ్ణి హతమార్చగలిగే శక్తివంతుడైన కుమారుడు నాకు కావాలి! నిష్ప్రయోజకుడుగా ఉన్న నా పెద్ద కొడుకు శిఖండివల్ల ఏ పనీ జరగదు గదా? నా అభీష్టం నెరవేరటానికి ఏదైనా మార్గం ఉంటే చూడండి. లేకపోతే ఈ మనోవ్యాధితో నన్ను మరణించ నివ్వండి" అని చెప్పాడు.

అప్పుడు పురోహితులు "మహారాజా! దీనికై మీరింతగా చింతించవలసిన పనిలేదు. 'ఇష్ట ఫలసిద్ధి' మహా యజ్ఞాన్ని చేస్తే, మీ కోరిక నెరవేరుతుంది. అయితే - అది వ్యయప్రయాసలతో కూడుకున్న మహాకార్యం" అన్నారు.

మంత్రులు వారితో "ఎంత వ్యయ ప్రయాసలైనా భరిస్తాం. మీరు యజ్ఞానికి కావలసిన ఏర్పాట్లు ప్రారంభించండి" అన్నారు.

పురోహితులు యాగం ప్రారంభించే పనుల్లో నిమగ్నులయ్యారు. వాళ్ళు సూచించిన శుభదినాన -

కిరణ్ కుమారి



ద్రుపద మహారాజు తన పత్నితో కలిసి శుచియై, బ్రాహ్మణ పూజలు చేసి, ఇష్ట దైవతాలను స్మరించుకుని, యజ్ఞదీక్ష వహించాడు.

పాంచాల నగరం వెలుపల నిర్మించిన బ్రహ్మాండమైన పందిరిలో ఆ యాగం ప్రారంభమైంది.

నగర వాసులే కాకుండా, పాంచాల దేశంలోని మారుమూల గ్రామాల నుండి ప్రజలు తండోపతండాలుగా వచ్చి, సముచిత కానుకలు సమర్పిస్తూ, తమ ప్రభువు తలపెట్టిన యజ్ఞనంలో పాల్గొన్నారు. యజ్ఞగుండం చుట్టూ వేద మంత్ర విశారదులైన భూసురోత్తములు మంత్రాలు చదువుతూండగా - నిరంతరం తనలో ధారగా పడుతూన్న నేతితో అగ్నిని వెదజల్లుతున్న యజ్ఞ గుండం నుంచి కొంత కాలానికి ధగద్ధగాయమానంగా ప్రకాశిస్తున్న ఓ రథం పైకి లేచింది. ఆ రథంలో, దివి నుండి భువికి దిగి వచ్చిన దేవకన్యలా సౌందర్య కాంతులతో ప్రకాశిస్తూన్న ఓ కన్యామణీ, నూనూగు మీసాల నూత్న యౌవనంతో సౌందర్యవంతుడైన ఓ వీరవరుడూ, కూర్చుని ఉన్నారు.

రథం నుండి యజ్ఞగుండం పైభాగం నుంచి ప్రక్కకు తిరిగి, క్రింద నిలువగానే - అందులోంచి యువతీయువకులు క్రిందికి దిగి ద్రుపద భూపతికి నమస్కరించారు.

అప్పుడు అశరీరవాణి "అహో ద్రుపద మహారాజా! నీ యాగదీక్షా ఫలితంగా అయోనిజులుగా జన్మించిన ఈ పుత్రిక, పుత్రుడు, ఇక నుంచి నీ సంతతిగా పరిగణింపబడతారు. సౌభాగ్యవతికి కృష్ణ అనీ, చిరంజీవికి ధృష్టద్యుమ్నుడనీ, నామకరణాలు చేస్తున్నాను. నీకు పుత్రిక కనుక ఇకమీదట కృష్ణ ద్రౌపది అని కూడా పిలువబడుతుంది - నీకూ, నీ పిల్లలకూ, శుభం కలుగు గాక" అని చెప్పింది. అశరీరవాణి చెప్పిన మాటలు అంతా విని ఎంతగానో సంతోషించారు. తమ ప్రభువు కోరిక నెరవేరిందని మంత్రులు, పురోహితులు అపరిమితానందం చెందారు.

ద్రుపదుడు, అతడి భార్య, పుత్ర, పుత్రికలను బిగి కౌగిట చేర్చుకుని ముద్దులతో వాళ్ళ ముఖాలను ముంచెత్తారు.

ఆ తర్వాత ద్రుపదుడు తన ప్రజలు జయ జయ ధ్వానాలు చేస్తూండగా - బిడ్డలను తీసుకుని

భార్యా సమేతంగా అక్కణ్ణుంచి రాజమందిరానికి వెళ్ళాడు.

ఒక శుభమూహూర్తంలో దృష్టద్యుమ్నుణ్ణి పాంచాల దేశపు యువరాజునుగా ప్రకటించి, పుత్రిక వివాహం గురించి ఆలోచనలో ఉండి పోయాడు.

మంత్రులు "ప్రభూ! దీనికింత ఆలోచన ఎందుకు? మేము హస్తినాపురానికి వెళ్ళి అర్జునుడి తల్లిగారితోను, అన్నదమ్ములతోను యువరాణిగారి వివాహ విషయమై సంప్రదించి వస్తాము. యజ్ఞ దీక్ష ఫలితంగా కలిగిన చిట్టె తల్లిని ఎట్టి పరిస్థితిలోనూ విధి అర్జునుడికి భార్యగా చెయ్యకపోదు. మీరు నిశ్చింతగా ఉండండి. మేము కార్యసాధన చేసుకుని వస్తాము" అని చెప్పి హుటాహుటిగా పాంచాలనుండి హస్తినకు బయలుదేరి వెళ్ళారు.

అయితే - వెళ్ళిన వాళ్ళు దైన్య ముఖాలతో వచ్చి, "పాండవులు కాశీ నగరంలోని లక్క ఇంటిలో తల్లితో సహా కాలిపోయారనీ, వారికి అంతిమ సంస్కారాలు కూడా జరిగాయని" చెప్పారు.

దాంతో ద్రుపదుడు మళ్ళీ దుఃఖించాడు. చివరకు పురోహితుల ప్రేరణతో మత్స్య యంత్రం నిర్మించి, దానిని ఛేదించిన వీరుడికి తన పుత్రికనిచ్చి వివాహం చేస్తానని ప్రకటించాడు. ఇలా ప్రకటించటంలో కూడా పురోహితులు చెప్పిన ఓ సూచన కారణం! శ్రుతి - ప్రతి శ్రుతి - అనే దివ్య విద్యలను ఆధారం చేసుకుని పాండవులు జీవించే ఉన్నారని ఘంటాపథంగా చెప్పిన పురోహితులు - ఒక్క అర్జునుడికి తప్ప





ఇతరులకు సాధ్యం కాని అద్వితీయ నిర్మాణంతో మత్స్య యంత్రాన్ని సృష్టించారు. క్రింద పళ్ళెరం లోని నీళ్ళలో చూస్తూ, ధనుర్బాణాలున్న చేతులను వెనక్కి పెట్టి, పైన యంత్రంలో కన్నుమూసి తెరిచేలోగా ఒక చోటు నుంచి మరో చోటికి దూకే చేపను ఒకే బాణంతో కొట్టాలి! అదీ మత్స్య యంత్రాన్ని ఛేదించటమంటే!" —

ఆ విధంగా తమ నగరంలో జరిగే ఉత్సవానికి సంబంధించిన సమగ్రమైన వృత్తాంతాన్ని వివరించాడు బ్రాహ్మణుడు.

పాండవులు ఆ వృత్తాంతం విని, తమలో కదిలే భావాలను పైకి వ్యక్తం కాకుండా జాగ్రత్త పడుతూ, ఆ బ్రాహ్మణుడికి నమస్కరించి, విష్ణు శర్మకు చెప్పి తమ అరలోకి వెళ్ళారు.

కుంతి కూడా ఆ అద్భుత వృత్తాంతాన్ని సావధానంగా విని ఉన్నందున, తమకు ఇకనైనా మంచిరోజులను అనుగ్రహించమని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ, కొడుకులతో బాటు లోపలికి వెళ్ళింది.

ఆ తర్వాత భోజనాలు చేస్తూన్న సమయంలో ధర్మరాజు "అమ్మా! విధి ఎంతటి విచిత్ర పరిస్థితిలో మన జీవితాలను నడిపిస్తున్నదో గ్రహించావా? ఇక మనం అక్కడిక్కడికి ఎందుకు? పాంచాల నగరానికే వెళదాం" అన్నాడు.

భీముడు చిరునవ్వుతో అర్జునుణ్ణి చూస్తూ "ఏం తమ్ముడూ! అన్నయ్య చెప్పినట్లు చేద్దామా?" అన్నాడు.

అర్జునుడు వినయంతో "అమ్మ, పెద్దన్నయ్యా నువ్వు తమ్ముడు, ఇష్టపడితే, అలాగే వెళదాం అన్నయ్యా!" అన్నాడు.

ఆ తర్వాత - పాండవులు తల్లితో కలిసి విష్ణు శర్మ దగ్గరికి వచ్చారు. ధర్మరాజు అతనితో "భూసురోత్తమా! మీ దయవల్ల మేము ఇంతకాలం ఇక్కడ ఏ లోపమూ లేకుండా గడిపాము. మా దాయాదులు ఈ పాటికి మా మీద మాత్సర్యం విడిచిపెట్టి, మా ఆస్తిపాస్తులను మా కివ్వటానికి సిద్ధంగా ఉంటారు. మేము మా ఊరికి వెళ్ళాలను కుంటున్నాం - సెలవు" అన్నాడు. విష్ణుశర్మ, అతడి భార్య, కొడుకు, పాండవులకు శుభం పలికి వీధి గుమ్మం దాకా సాగనంపారు.

తమ పాలిటి దేవతల్లా ఆ తల్లీ కొడుకులు తమ్ము విడిచి వెళ్ళటానికి ఏకచక్ర పురాగ్రహా రీకులు చాలా విచారించారు.

పాండవులు పాంచాల పురాభిముఖంగా ప్రయాణిస్తూ, ఒకనాటి మధ్యాహ్న సమయానికి ఓ కొలను దగ్గరికి చేరి గట్టు మీద విశ్రాంతి కోసం ఆగారు. ఆ సమయంలో అంగార వర్ణుడనే గంధర్వుడు తన ప్రియురాండ్రతో అక్కడికి వచ్చాడు.

అతడు బ్రాహ్మణ వేషాలతో ఉన్న పాండవులను, కుంతిని చూస్తూ "ఎవరు మీరు? ఎందుకున్నా రిక్కడ?" అన్నాడు.

అర్జునుడు అతడితో "చూస్తే, భూలోకవాసివిగా లేవు. ఏ లోకం నుంచో వచ్చి మమ్మల్ని అడుగు తున్నావా - ఎందుకున్నారిక్కడ అని?... అయినా, అడిగావు కాబట్టి చెబుతున్నాను. మేము బాటసారులం. విశ్రాంతి కోసం ఈ గట్టు మీద ఆగాం. అర్థ మైందా?" అన్నాడు.

అంగారవర్ణుడు అహంకారంతో అర్జునుణ్ణి చూస్తూ "అనర్థం ఏర్పడకముందే ఇక్కణ్ణుంచి వెళ్ళిపొండి. నేను నా ప్రియురాండతో ఈ కొలనులో జలక్రీడలాడాలి" అన్నాడు.

అర్జునుడు తీవ్రంగా అతణ్ణి చూస్తూ "నీ జల క్రీడలకు ఇంకెక్కడైనా మరో జలాశయం వెతుక్కో. మేము ఇక్కణ్ణుంచి కదలం" అన్నాడు.

అంగారవర్ణుడు "అయితే - మీకు ప్రాణాల మీద తీపి లేదన్న మాట" అని చేతుల్లోకి ధనుర్బాణాలు రప్పించుకున్నాడు. అంతకాలం చాపచుట్టగా ఉంచి ధనుస్సును, మూటలో భద్ర పరిచిన అంబుల పొదిని అర్జునుడు ధరించి, అతణ్ణి ఎదుర్కొన్నాడు.

అర్జున, అంగారపర్ణులకు అప్పుడక్కడ భీకర పోరాటం జరిగింది. ఆ పోరులో అంగారవర్ణుడు





ఓడిపోగా, అతడి ప్రియురాండ్రు అర్జునుణ్ణి శరణుకోరారు. అర్జునుడు అంగారపర్ణుణ్ణి విడిచి పెట్టగా, అతడు అర్జునుడితో స్నేహం చేసుకుని, కొద్ది దివ్య బాణాలను ఇచ్చి, ధర్మరాజుకు, కుంతికి, భీమనకుల సహదేవులకు నమస్కరించి, తన ప్రియురాండ్రతో కలిసి తన లోకానికి వెళ్ళాడు.

ఆ తర్వాత - పాండవులు విశ్రాంతి తీసుకున్న తర్వాత అక్కణ్ణుంచి బయలుదేరి కొంత దూరంలో ఉన్న ధౌమ్యుడనే మునిని సేవించి, ఆయనను తమ పురోహితుణ్ణిగా స్వీకరించారు. ధౌమ్య మహర్షి కూడా తమ వెంటరాగా, తల్లితో కలిసి, కొన్నిరోజులకు పాంచాలనగరం చేరుకున్నారు.

* * *

ఒకనాడు - కృష్ణుడు ద్వారకా నగరంలోని ఏకాంత మందిరంలో అన్నదమ్ములతోనూ, కృతవర్మ తోనూ, సమావేశమై రాజకార్యాలను గురించి, రక్షణ విషయాలను గురించి ఆలోచిస్తున్నాడు. తమ మీద పగబట్టి, సమయం చూసి ద్వారకా నగరం మీద దండెత్తాలనుకుంటున్న శత్రువుల ప్రస్తావన వచ్చింది.

అప్పుడు కృతవర్మ బలరామ కృష్ణులతో "ప్రభువులారా! దేశదేశాలకు నేను పంపిన గూఢచారులు ఇంతకు ముందే వచ్చి, మన విధుల ప్రయత్నాలను గురించి వివరించారు. ప్రస్తుతం ఉన్న శత్రువులుగాక - ఇప్పుడు కొత్త శత్రువులుకూడా తలయెత్తుతున్నారు" అన్నాడు.

కృష్ణుడు "కృతవర్మ నాయకా! ఆ కొత్త శత్రువులు ఎవరు?" అని ప్రశ్నించాడు. కృతవర్మ ఇలా చెప్పాడు.

"ఏలినవారి చేత సంహరించబడిన పౌండ్రక వాసుదేవుడి కుమారుడు కాలకేతువు, అతడి మిత్రుడైన కాలయవనుడు, ప్రాగ్జోతిహ పురాధి పతియైన నరకుడు కొత్త శత్రువుల్లో ముఖ్యులు. వీరి ముగ్గురితోనూ జరాసంధుడు స్వయంగా సంప్రతించి, తనకు అనుకూలురనుగా చేసుకున్నాడు. ఇంకా శిశుపాలాదులు ఉండనే ఉన్నారు. జరా సంధుడు ఈ మధ్య పాత కొత్త శత్రువులందరినీ ఒక చోట సమావేశపరచి, ఉమ్మడిగాగాని, విడి విడిగాగాని ద్వారక మీద యుద్ధాన్ని ప్రకటించా లని కోరాడు. అందుకు నరకుడు అంగీకరించక - మీరు ఉమ్మడి వ్యూహంతో ఆ బలరామ

కృష్ణులను ఎదిరించండి. నేను ఆ కృష్ణుడిని నా నగరానికే రప్పించి మట్టుబెడతానని ప్రగల్భాలు పలికాడట. అప్పటినుంచి అతడు తమ అను గ్రహానికి పాత్రులైన రాజులను, సత్పురుషులను రకరకాలుగా బాధిస్తూ, యుక్తవయసులో అడుగు పెట్టిన వారి కూతుంద్రను చెరపడుతున్నాడట. నేను నగర రక్షణకు పటిష్టమైన ఏర్పాట్లు చేసి ఉన్నాను. ఏ క్షణంలోనైనా కబురు అందితే, తక్షణం నగరానికి తరలించటానికి మారుమూలల ఉన్న సైనిక దళాలను సర్వాయుధ సన్నద్ధంగా ఉంచమని దళపతులందరికి వర్తమానం పంపాను. క్రమశిక్షణలో తమకు తామేసాటి అనిపించుకున్న వారు - అయిన నారాయణాజ్యులను పదివేల మందిని హెచ్చరించాను."—



కృష్ణుడు సాలోచనగా "మంచిది. మాకు ఎప్పుడు ఎక్కడికి ప్రయాణం తటస్థించినా, తిరిగి వచ్చేదాకా - ఏదైనా ప్రమాదం ముంచు కొస్తే, తక్షణం చతురంగ బలాలతో పోరాటానికి నువ్వు సిద్ధంగా ఉండాలి" అన్నాడు.

కృతవర్మ "అలాగే ప్రభూ!" అన్నాడు.

అప్పుడు బలదేవుడు "మనకు ఇంకా ఎక్కడికి ప్రయాణాలు తటస్థిస్తాయి కృష్ణా!" అన్నాడు.

చిరునవ్వుతో అన్నను చూస్తూ కృష్ణుడు "ఏమో చెప్పలేం కదా? ఇంకో క్షణంలోనే తటస్థపడవచ్చు. ప్రయాణాలూ, ప్రమాదాలూ చెప్పి రావు కదా అన్నయ్యా!" అన్నాడు.

ఆ సమయంలో ద్వారపాలకుడు ఓ వార్తాహరుణ్ణి వెంట తీసుకుని వచ్చి బలరామ కృష్ణులను చూస్తూ "వారే మా ప్రభువులు. మీ మహారాజుగారి ఆహ్వానమేమిటో వెల్లడించు" అని చెప్పి వెళ్ళి పోయాడు.

ఆగంతకుడు బలరామకృష్ణులకు, సాత్యకి కృతవర్మలకు నమస్కరించి, తన దట్టీలో భద్రంగా దాచుకువచ్చిన ఓ లేఖను అందజేశాడు.

కృష్ణుడు చెప్పగా సాత్యకి ఆ ఉత్తరాన్ని చుట్ట విప్పి, ఇలా చదవడం మొదలు పెట్టాడు:

"శ్రీ మదఖలాండ బ్రహ్మాండ నాయకులు - ద్వారకా నగర నిర్మాణ దక్షులు - యాదవ సామ్రాజ్య ప్రజాభీష్ట సిద్ధిదాయకులు - ప్రపంచ ప్రజానాయకులు - అయిన శ్రీ కృష్ణదేవుల సన్నిధికి...

నేను తమరిని ఎన్నడూ చూడకపోయినా -

దివ్య మునీంద్రులైన నారదులవారివల్ల మీ మహిమాన్విత కథలు విని ఉన్నాను. అర్జునుణ్ణి అల్లుణ్ణిగా పొందాలని నేను ఎన్నెన్నో ప్రయాసలు పడి, యజ్ఞ పురుషుణ్ణి మెప్పించి, కృష్ణ - ద్రౌపది - అనే పేర్లతో అయోనిజగా ఆవిర్భవించిన పుత్రికా రత్నాన్ని సిద్ధింపజేసుకున్నాను.

అయితే - దుర్విధివశాత్తూ దాయాదుల కపటోపాయానికి లోనై పాండవులు తల్లితోబాటు లక్క ఇంటిలో మృతి చెందారని నా మంత్రులు హస్తినాపురానికి వెళ్ళి, ఓ దుర్వార్త తెచ్చారు. నా దురదృష్టాన్ని నిందించుకుంటూ విచారిస్తూండగా, వేదవేద్యులైన మా పురోహితులు నన్ను ప్రబోధించి, పాండవులు జీవించే ఉన్నారని 'శ్రుతి - ప్రతిశ్రుతి' అన్న దివ్య విద్యల ద్వారా తాము ఈ విషయం తెలుసుకున్నామని చెప్పారు. ఒక్క అర్జునుడికి తప్ప - ఇతరులకు సాధ్యంకాని మత్స్య యంత్ర భేదనం వర పరీక్షగా నిర్ణయించి - మత్స్య యంత్రాన్ని భేదించగల వీరుడికి నా పుత్రికను ఇచ్చి వివాహం చేస్తానని దేశ దేశాలకు ప్రకటనలు పంపాను. నిర్ణీత సమయానికి రాజపుత్రులంతా నా నగరానికి తరలివస్తామని చెప్పి పంపారు.

మీరు పాండవులకు మేనబావ అని నారదులవారు చెప్పి - మీ చెల్లెలైన ద్రౌపదీకుమారి స్వయంవర పరీక్షలో ఏర్పాటు చెయ్యబడే సభకు అధ్యక్షపీఠాన్ని అలంకరించవలసిందిగా అర్థిస్తున్నాను.

మీ అన్నగారైన బలరామ సార్వభౌములను, తమ్ముడైన సాత్యకిని, తల్లిదండ్రులైన దేవకీ వసుదేవులను, యశోదా నందులను, మాతామహుడైన ఉగ్రసేన చక్రవర్తులను - ప్రత్యేకించి మా కోడలు చిరంజీవి సౌభాగ్యవతి రుక్మిణీదేవిని - ఇంకా తక్కిన బంధు మిత్రులందరిని కూడా వెంట బెట్టుకు రమ్మని మరీ మరీ ప్రార్థిస్తున్నాను. ముఖ్యమైన వివరాలను ఈ వార్తాహరుడు వివరించగలడు. మీ ఆగమనాభిలాషి —
ద్రుపదుడు: పాంచాలరాజు" — (ఇంకావుంది)





# పాపహారి

శివానందుడనేవాడు సదానందుడనే సన్యాసి వద్ద చాలాకాలం శుశ్రూష చేసి వేదాంత జ్ఞానం పొందాడు. అప్పుడు వాడికి మానవ సేవ చేయాలన్న కోర్కె కలిగింది. గురువు వాడి కోరిక విని, "కొంత కాలం మనుషుల మధ్య తిరుగు. వాళ్ళకు మంచి చెడ్డలు వివరించి చెప్పు. చెడ్డ వారిని మార్చాలనిగానీ మంచివారికి సాయపడాలని గానీ మాత్రం ఆలోచించకు" అని సలహా ఇచ్చి పంపాడు.

సరేనని శివానందుడు బహుపురమనే పట్నం చేరుకున్నాడు. అక్కడ వాడు పగలంతా ఇంటింటికీ తిరిగి నీతి బోధలు చేస్తూండేవాడు.

కరాళ కథలు



ప్రతి వాళ్ళూ వాడు చెప్పేది భక్తి శ్రద్ధలతో వినేవారు. కానీ నీతి సూత్రాలు పాటించాలంటే అందరికీ ఏదో ఇబ్బంది ఎదురవుతూనే ఉండేది. అన్నింటికంటే ముఖ్యమైనది డబ్బు ఇబ్బంది.

ఒకడు కొడుకు పెళ్ళికి కట్నం పుచ్చుకున్నాడు. అది నేరం. కానీ ఏం చేస్తాడు? కూతురు పెళ్ళీడు కొచ్చింది కట్నమివ్వందే దాని పెళ్ళి కాదు.

ఒకడి తలిదండ్రులు దీర్ఘ రోగంతో బాధపడు తున్నారు. వైద్యానికి బోలెడు ఖర్చవుతోంది. అది నేరమని తెలిసినా లంచం పుచ్చుకుంటున్నాడు.

ఒకడు బియ్యం వ్యాపారం చేస్తున్నాడు. లంచ మివ్వకపోతే రాజోద్యోగులు ఏదో వంకపెట్టి దుకాణం మూయించేస్తానన్నారు. మామూలుగా వచ్చే లాభాలు లంచమివ్వడానికి చాలవు. అందుకని వాడు బియ్యంలో రాళ్ళు కలిపి అమ్ముతున్నాడు.

ఇలా ఎందరో ఎన్నో తప్పులు చేస్తున్నారు. ఇంచుమించు అందరూ డబ్బు కోసమే తప్పులు చేస్తున్నారు.

"తప్పులు చేయడం పాపం. పాపం చేసినవాడు చనిపోయాక నరకానికి వెళ్ళి యాతనలు పడతాడు. అన్నింటికీ దేవుడున్నాడు. దేవుణ్ణి నమ్మితే అన్ని సమస్యలూ ఏదో ఒక రోజున వాటంతటవే పరిష్కారమవుతాయి. కాబట్టి పాపం చేయకండి" అని శివానందుడు అందరికీ చెబుతూండేవాడు.

శివానందుడిలో ఏదో ఆకర్షణ శక్తి ఉంది. వాడి మాటలనంతా వినేవారు. తమకు మారాలని ఉన్నా మారలేకపోతున్నందుకు సంజాయిషీ ఇచ్చుకునేవారు. ఆ ప్రకారం కొందరు, "ఇంత వరకూ చేసిన పాపాలనుంచి మాకు విముక్తి లభించే మార్గం లేదు. ఎలాగూ పాపాత్ములయ్యాం. నరక బాధ తప్పదు కాబట్టి పాపాత్ములుగానే ఉండిపోతాం" అన్నారు. మరికొందరు, "దేవుణ్ణి నమ్మి ఎంతో కాలం ఎదురు చూసి, ఎదురు చూసి విసిగిపోయి పాపాలు చేయడం మొదలు పెట్టాం. తొందరగా కోర్కెలు తీర్చే దేవుడు లేడు కదా!" అన్నాడు.

ఇది విని శివానందుడు ఆలోచనలో పడ్డాడు. ప్రపంచంలో పాపాత్ముల సంఖ్య నానాటికీ పెరిగి పోతోంది. వారికి పాపం నుంచి విముక్తి కలిగించి, తొందరగా కోర్కెలు తీర్చే దేవుణ్ణి చూపిస్తే, క్రమంగా పాపాత్ముల సంఖ్య తగ్గుతుందని వాడికి తోచింది. అందుకని వాడు బహుపురంలోని

విశాల మైదానం మధ్యలో ఒక దేవతా విగ్రహాన్ని ప్రతిష్ఠించి దానికి పాపహారి అని పేరు పెట్టాడు. పాపహారిని దర్శించుకుని కష్టాలు, పాపాలు చెప్పుకున్నవారికి ఆ రెండూ తొలగిపోయే ఉపాయం శివానందుడు చెబుతాడు.

ఇదేమిటో చూడాలని కొందరు భక్తులక్కడకు వచ్చారు. శివానందుడు పాపాత్ముల పాపాలు విని పరిహారంగా వారెంత డబ్బివ్వాలో చెప్పేవాడు. ఆ డబ్బును వేరేగా భద్రపరుస్తూ - అందులోంచి కొంత తీసి కష్టాల్లో ఉన్నవారికిస్తూండేవాడు.

శివానందుడి మహిమ ఏమోగానీ వాడి ముందు భక్తులెవ్వరూ అబద్ధం చెప్పలేకపోయేవారు. వాడిని మోసం చేసి లేని కష్టాలు చెప్పుకుని దానం పొందాలనుకుని వచ్చినవారు కూడా చివరకు నిజం చెప్పి తమ పాపాలనేకరవు పెట్టి అందుకు తగిన రుసుము చెల్లించి మరీ వెడుతూండేవారు. కష్టాల్లో ఉన్నవారు కూడా తమ కష్టాలు తీరడానికి అవసరమైనంత డబ్బునే అడిగేవారు. అందుకే పాపహారి ఆదాయం వ్యయంకంటే ఎక్కువుండేది.

కొన్నాళ్ళకు పాపహారి దేవతకు పెద్ద గుడి ఏర్పడింది. గుడి చుట్టూ ఎన్నో దుకాణాలు వచ్చాయి. ఆ ప్రాంతం నిత్యం వచ్చే భక్తుల రాకపోకలతో సందడిగా ఉండేది.

అలా కొంత కాలం జరిగేక శివానందుడు తను చేస్తున్న మానవ సేవ గురించి వివరంగా లేఖ వ్రాసి గురువుకు పంపుతూ ఒకసారి ఆయన వచ్చి తననాశీర్వదించాలని కోరాడు. శిష్యుడి కోర్కెను మన్నించి వచ్చిన సదానందుడు అక్కడి పరిస్థితి గమనించి, "శివానందా! నేను ఏద్వైతే





వద్దన్నానో అదే నువ్వు చేశావు. మనిషికి నీతి సూత్రాలు చెప్పి ఊరుకోమన్నాను, మనిషిని మార్చే ఆలోచన వద్దన్నాను, మరిచేవా?" అన్నాడు.

"గురువర్యా! ప్రపంచంలో పాపుల సంఖ్యనరి కట్టడానికి నాకిదొక మార్గంగా తోచింది. ఇందులో తప్పేముంది?" అన్నాడు శివానందుడు, "నేనిప్పుడు కష్టాల్లో ఉన్నవారికి నెలకు లక్ష రూపాయల వరకూ దానంగా ఇచ్చి సాయపడగల్గుతున్నాను. కొద్ది కాలంలోనే ఈ మొత్తం పది లక్షల వరకూ పెరుగుతుందని నా నమ్మకం!

సదానందుడు నవ్వి, "నీకు వచ్చే ఆదాయం పాపాత్ముల నుంచి. నీ ఆదాయం పెరుగుతున్నదంటే పాపాల సంఖ్య పెరుగుతున్నట్లే కదా! "అన్నాడు.

శివానందుడు తడబడ్డాడు. అయితే తొందరగానే వాడికి సమాధానం తట్టింది, "గురువర్యా! పాపహారి దేవత వల్ల పాపాత్ముల సంఖ్య పెరగడం లేదు. దేవతను నమ్మే పాపాత్ముల సంఖ్య పెరుగుతోంది. మొదట్లో కొందరు మాత్రమే దేవతను నమ్మారు. అందుకని ఆదాయం తక్కువగా ఉండేది. ఇప్పుడెక్కువ మంది నమ్ముతున్నారు. అందుకని ఆదాయం పెరిగింది" అన్నాడు.

సదానందుడు తల అడ్డంగా ఊపి, "నువ్వు భ్రమలో ఉన్నావు. నువ్వు చెప్పిందే నిజమైతే ఏదో ఒక రోజున నీ గుడికి ఆదాయం తగ్గిపోవాలి. కానీ నేను చెబుతున్నాను విను. నీ గుడి కారణంగా పాపాత్ముల సంఖ్య ఇంకా ఇంకా పెరుగుతుంది. నీ గుడి ఆదాయం కూడా పెరుగుతుందే తప్ప తరగదు" అన్నాడు.

"గురువర్యా! మీవద్ద నేనెంతో వేదాంత జ్ఞానం తెలుసుకున్నాను. ఇప్పుడు మీరు చెప్పేది మాత్రం నేనొప్పుకోను. మీ మాటలకు ఋజువు లేదు" అన్నాడు శివానందుడు.

"నీ వద్దకు వచ్చే భక్తులేం చేస్తున్నారో తెలుసుకునే ప్రయత్నం చేస్తే నీకు ఋజువెప్పుడో దొరికి ఉండేది" అన్నాడు సదానందుడు.

"అయితే ఇప్పుడా పని చేద్దాం!" అన్నాడు శివానందుడు పట్టుదలగా.

ఆలయంలో భక్తుల రద్దీ ఎక్కువ కావడంతో కొంత కాలంగా శివానందుడో కొత్త ఏర్పాటు చేశాడు. పాపాలకు పరిహారం మొత్తాలు పట్టికగా వ్రాయించాడు. ఆ ప్రకారం అబద్ధమాడినవారు ప్రతి అబద్ధానికీ నూర్రూపాయలు పాపహారి దేవతకు

ముడుపు చెల్లించాలి. తెలియనివారిని మోసం చేస్తే అయిదు వందలు, మిత్రులను మోసం చేస్తే వెయ్యి రూపాయలు, అయినవాళ్ళకు మోసం చేస్తే రెండు వేలు, దొంగతనానికి పదివేలు, హత్యకు లక్ష రూపాయలు చొప్పున ముడుపు కట్టాలి. ఇలా పాపాలకు రకరకాల ముడుపును పాపహారిని దర్శించుకున్న భక్తులు హుండీలో వేయాలి. కష్టాల్లో ఉన్నవారు మాత్రం పాపహారిని దర్శించుకున్నాక శివానందుణ్ణి కలుసుకోవాలి.

ఇప్పుడు శివానందుడు పాప పరిహారం చెల్లించిన భక్తుల్ని కూడా తనను కలుసుకోవలసిందిగా కోరాడు. అలా వచ్చిన వారిలో మొదటివాడు మోసగాడు. వాడు మిత్రుణ్ణి మోసం చేసి రెండు వందలు కాజేశాడు. పాప పరిహారంగా వెయ్యి రూపాయలు కట్టాలి. అందుకని వాడు తనకు తెలియని అమాయకుణ్ణి మోసం చేసి పదివేలు కాజేశాడు. రెండు తప్పులకూ పదిహేను వందలు ముడుపు చెల్లించగా వాడికింకా ఎనిమిదివేల అయిదొందలు మిగిలింది. తన పాపాలు పోగొడుతూ తనకు లాభాలు తెచ్చిపెడుతున్న పాపహారి దేవతను చూడ్డానికి ఏడాదికొకసారైనా వస్తూంటాడు వాడు.

రెండోవాడు దొంగ. వాడు దొంగిలించిన బంగారు నగను అమ్మితే అయిదు వేల రూపాయలు వచ్చాయి. ఆ పాపం వదుల్చుకోవాలంటే పదివేల రూపాయలు కావాలి. ఇప్పుడు లక్ష రూపాయలైనా దొరికే ఇల్లు చూపెట్టమని పాపహారి దేవతను కోరడానికి వచ్చాడు.

మూడోవాడు భూపతి కథ ఇంకా చిత్రంగా ఉంది. ఆయన శ్రీపతి అనే మిత్రుడితో కలిసి





ఓ కోటీశ్వరుణ్ణి చంపడానికి పథకం తయారు చేశాడు. హత్య భూపతి చేస్తే ఆస్తి శ్రీపతి వశమయింది. శ్రీపతి వాడికి పదిలక్షలిచ్చి ఎక్కడికైనా పొమ్మన్నాడు. కానీ హత్య చేయడంవల్ల వాడికి మనశ్శాంతి లేకుండా పోయింది. ఎంతసేపూ చచ్చినవాడి శవం కళ్ళ ముందు మెదలుతోంది. తను తప్పు చేశానని వాడికి తోచింది. ఒక సాధువు వాడి కథ విని, "నువ్వు చెయ్యకూడని తప్పు చేశావు. చేతులు కాలేక ఆకులు పట్టుకుని లాభం లేదు కదా! నీ డబ్బుతో పేదవారికి సాయపడు. చరమ జీవితాన్ని మానవ సేవకే అంకితం చేసి పవిత్రంగా గడుపు" అని సలహా ఇచ్చాడు. భూపతికీ సలహా నచ్చింది. కానీ ఎక్కడ చూసినా వాడికి మోసగాళ్ళే కనబడుతున్నారు. ఎవరు మంచో, ఎవరు చెడ్డో తెలియడంలేదు. ఎవరిది నిజమో, ఎవరిదబద్ధమో అర్థం కావడం లేదు. తన డబ్బు దుర్వినియోగం కాకూడదని భూపతి కోరిక. అలాంటి పరిస్థితుల్లో వాడికి బహుపురంలోని పాపహారి దేవత గురించి తెలిసింది. తన డబ్బునా గుడికి విరాళంగా ఇస్తే అది అర్హులను మాత్రమే చేరుతుందని వాడి నమ్మకం.

ఈ కథ విని శివానందుడు పక్కనే ఉన్న గురువు వంక గర్వంగా చూశాడు. సదానందుడు భూపతితో, "నీ కథ వింటూంటే నాకెంతో సంతోషంగా ఉంది. ఇప్పుడు నీవు నీకున్నదంతా గుడికి విరాళంగా ఇస్తున్నావా?" అన్నాడు.

భూపతి తల అడ్డంగా ఊపి, "నేనిక్కడకు రావడమెంతో మేలయింది. ఇంతకాలం చేసిన పాపం తల్చుకుని ఎంతో కుమిలిపోతున్నాను. అంటూ తన దగ్గరున్న డబ్బులోంచి ఎంచి రెండు లక్షలు శివానందుడి ముందుంచాడు.

"నీవు చేసింది ఒక హత్య అయితే రెండు లక్షలిచ్చావేం!" అన్నాడు శివానందుడు ఆశ్చర్యంగా.

భూపతి క్షణం పాటు తటపటాయించి, "దివ్య దృష్టి గల మహాత్ములు మీ వద్ద దాచడాని కేముంది? నా మిత్రుడు శ్రీపతి నాచేత పెద్ద పాపాన్ని చేయించాడు. కోటి రూపాయలు తను చేజిక్కించుకుని పదిలక్షలతో నన్ను సాగనంపాడు. వాడంటే నాకు చెప్పలేనంతా కసిగా ఉంది. ఇప్పుడు వెళ్ళి వాణ్ణి కూడా చంపి ఆ ఆస్తిని చేజిక్కించుకుని కలకాలం సుఖంగా జీవిస్తాను. చేయబోయే హత్య కోసం ముందుగానే లక్ష

రూపాయలిచ్చుకుంటున్నాను. పాపహారి దేవత అనుగ్రహం నాకు లభించగలదనే ఆశ!" అన్నాడు.

శివానందుడిక మిగతా భక్తుల్ని చూడలేదు. వాడారాత్రికి రాత్రే గురువుతో కలిసి అరణ్యావాసానికి వెళ్ళిపోయాడు. అంతమాత్రాన పాపహారి దేవత గుడిమూత పడలేదు. అదిప్పుడు మోసగాండ్ల చేతిలోకి మారి దినదిన ప్రవర్ధమానమవుతోంది.

కరాళుడింత వరకే కథను చెప్పి, "ఓ సవిత్ర్యుక మహారాజా! తప్పు చేసినవాడికి విమోచనా మార్గం చూపకపోతే నిరాశ చెంది మరిన్ని తప్పులు చేస్తాడు. అది తెలిసి శివానందుడు పాపహారి దేవతను సృష్టిస్తాడు. అయినా దుష్ఫలితమే వచ్చింది. అందుకని శివానందుడు అరణ్యవాసానికి వెళ్ళడం ఎంత వరకూ తగును? పాపహారి దేవత గుడి దుష్టుల చేతిలో పడింది కదా! అసలు పాపాత్ములకు మోక్షముందా? తెలిసి కూడా ఈ నా సందేహాలకు సమాధానం చెప్పకపోయావో ఈ క్షణం నుంచీ నీవు నాకు బానిసవు" అన్నాడు.

దీనికి సవిత్ర్యుకుడిలా బదులిచ్చాడు.

"మనిషికి మంచి, చెడులను వివరించి చెప్పాలి. మంచిని ఆదరించాలి. చెడును శిక్షించాలి. విమోచనా మార్గాలు చెప్పడం వల్ల చెడుకు ప్రోత్సాహమెక్కువౌతుంది. అదే శివానందుడు చేసిన తప్పు. తన బుద్ధి ఇంకా వికసించలేదని గ్రహించి వాడు గురు శుశ్రూష చేయడానికి అరణ్యాలకు వెళ్ళాడు. అది సబబే! ఇక పాపహారి దేవత గుడి మోసగాళ్ళ చేతిలో పడితే ఇక పాపాత్ములకు మోక్షం విషయం. పాపాన్ని మానడం తప్ప వారికి మరో మోక్షం మార్గం లేదు —"

అది సరియైన సమాధానం కావడంతో సవిత్ర్యుకుడి కెదురుగా ఉన్న కన్యపై కరాళుడి ప్రభావం నశించి ఆ యువతి ముళ్ళ పందిగా మారి అడవిలోకి పరుగు తీసింది. — కమల



# కాకి పిల్ల కాకికి ముద్దు

కొంతమ్మ గయ్యాళి. ఎవరినైనా నోటికి ఎంతవస్తే అంత మాటా అంటుంది. అదృష్టం కొద్దీ ఆమె భర్త, ఇరుగు పొరుగులు కూడా మెత్తనివారు. అందుకని ఆమె ఏమన్నా పడి ఊరుకునేవారు.

కొన్నాళ్ళకు కొంతమ్మకు వనజ అనే కూతురు పుట్టింది. ఆ పిల్ల అంటే కొంతమ్మకు పంచ ప్రాణాలూనూ. వనజ పెరిగి పెద్దదౌతూ అన్నీ తల్లి గుణాలే పుణికి పుచ్చుకుంది. అది తల్లిని కూడా లెక్క చేయకుండా నానా మాటలూ అనేది. అయితే, వనజ ఏమన్నా కొంతమ్మకు ముచ్చటగా ఉండేదే తప్ప కోపం వచ్చేది కాదు.

ఇలా ఉండగా కొత్తగా కొంతమ్మ పొరుగున శాంతమ్మ అనే ఇల్లాలు వచ్చింది. ఆమె చాలా మంచిదే కానీ మాటపడదు. శాంతమ్మ కూతురు గిరిజ కూడా తల్లి గుణాలు పుణికి పుచ్చుకుంది.

ఒకరోజున వనజ ఆటలాడుతూ గిరిజను కొట్టింది. గిరిజ వనజను అంతకంటే బలంగా కొట్టింది. వనజ ఏడుస్తూ వెళ్ళి తల్లికి ఫిర్యాదు చేసింది. కొంతమ్మ శాంతమ్మను సంజాయిషీ అడిగితే ముందు వనజే గిరిజను కొట్టిందని ఆమె ఋజువు చేసింది.

"కొడితే కొట్టింది కానీ నా కూతురేం చేసినా ముద్దుగా ఉంటుంది. నీ కూతురు మోటు. దాన్ని మందలించు" అంది కొంతమ్మ.

"కాకి పిల్ల కాకికి ముద్దు అంటారు. నీ కూతురేం చేసినా నీకు ముద్దు. నా కూతురేం చేసినా నాకు ముద్దు. దాన్ని మందలించను. వెళ్ళు" అంది శాంతమ్మ.

కొంతమ్మకేమనాలో తెలియలేదు. కానీ గిరిజ కారణంగా వనజలో క్రమంగా మంచి మార్పే వచ్చింది — తల్లి తనను కాపాడలేదని తెలిసేక!

సామెత కథలు

—జ్యోతిర్మయి






విరాటుడికి బాగా డబ్బుంది. కానీ తృప్తిలేదు. అందుకని గురువునాశ్రయించి మూడేళ్ళపాటు చదువుకున్నాడు. పాండిత్యం వచ్చింది కానీ, సంతోషం కలగలేదు. అందుకని వాడు ఎప్పుడూ దిగులుగా ఉండేవాడు.

ఒకసారి విరాటుడుండే ఊరికి మహిమలు చేసే బైరాగి వచ్చాడు. ఆయనవల్ల ఎందరో సంతోషం పొందుతున్నారని విని విరాటుడు కూడా కలుసుకుందుకు వెళ్ళాడు. బైరాగి వాడిని ఏం కావాలని అడిగాడు.

"నాకు డబ్బుంది. చదువుంది. ఈ రెండూ ఉన్నా సంతోషం లేదు. అదెలా వస్తుందో తెలియక దిగులుతో ఉన్నాను" అన్నాడు విరాటుడు.

"మనిషికి అన్నీ ఉంటే చాలదు. అవసరంలో ఉన్న సాటి మనిషికి సాయపడాలి. అందువల్లనే ఎవరికైనా తృప్తి, సంతోషం కలుగుతాయి. నువ్వు పరోపకారం చేయి" అని బైరాగి సలహా ఇచ్చాడు.

ఆ రోజు నుంచీ విరాటుడు పరోపకారం ప్రారంభించాడు. కొందరికి ఉచితంగా చదువ
చెప్పేవాడు. కొందరికి డబ్బిచ్చేవాడు.

అయితే ఇందువల్ల కూడా విరాటుడికి సంతోష
కలగలేదు. వాడు ఉచితంగా చదువుచెప్పి తవ
పొట్ట కొడుతున్నాడని కొందరు గురువులు గో
పెట్టారు. వాడు పాఠాలు తప్పుగా చెబుతున్నాడ
కొందరు శిష్యులు దుష్ప్రచారం ప్రారంభించారు
అలాగే డబ్బు తీసుకున్న వాళ్ళు కూడా వాడి
అన్యాయపు సొమ్ము అనీ అది అచ్చిరావడం లేద
చాటుగా అనేవారు. ఎదురుగా మాత్రం అం
విరాటుడిని పొగిడేవారు. వాడివల్ల ఉపకారాలు
పొందేవారు.

ఇతరుల చాటు మాటలు విరాటుడికి బాధ
కలిగించేవి. వాటి ఆధారంగా వాడు, "
గురించి అలా ఎందుకన్నార"ని కొందరిని ని
దీశాడు. వాళ్ళు తామలా అనలేదని చెప్
"ఋజువు లేని చెప్పుడు మాటలు వినకు. వ
పుణ్యం పోతుంది" అంటూ నీతులు చెప్పారు.

వసుంధర



తప్పుచేసిన వాళ్ళ చేత తప్పులు ఒప్పించి తగిన
క్ష విధించాలన్న కోరిక కొన్నాళ్ళకు విరాటుడిలో
ట్టి క్రమంగా బలపడింది. అప్పటికి బైరాగి
ారొదిలిపోవడంవల్ల వెతుక్కుంటూ ఆయన
ం వెళ్ళి ఓ అడవిలో చెట్టుకింద ఆయన్ను
ట్టుకుని తన బాధ చెప్పుకున్నాడు విరాటుడు.

బైరాగి విరాటుడికో వేరునిచ్చి, "నీవెవరికి
పకారం చేసినా ఈ వేరును ముందుగా వారికి
కించు. నీది అపాత్రదానం కాకుండా
తుంది. దానం చేయడం ఎంత పుణ్యమో
పాత్ర దానం అంత పాపం" అన్నాడు.

విరాటుడా వేరును మహా ప్రసాదంగా స్వీకరించి,
ంతోషంగా జీవితం గడపాలని నా కోరిక.
ి మీ వల్లనే సాధ్యపడుతుందని నా నమ్మకం.
తమరిని మళ్ళీ కలుసుకోవాలంటే ఎక్కడ వీలవుతుందో చెప్పండి" అని బైరాగిని అడిగాడు.

"నీకు నా అవసరం కలిగినపుడు నేనే నీ దగ్గరకు వస్తాను" అని అన్నాడు బైరాగి.

విరాటుడు బైరాగి చెప్పినట్లే చేశాడు. అప్పట్నించీ వాడిని చాటుగా తిట్టుకునే శిష్యులు నేర్చుకున్న పాఠాలన్నీ మర్చిపోయేవారు. చాటుగా తిట్టుకునే వాళ్ళకు తీసుకున్న డబ్బు మాయమయ్యేది. అందువల్ల క్రమంగా అవసరం ఉన్నవారు మాత్రమే విరాటుడి వద్దకు వచ్చేవారు. ఎందుకంటే మోసం చేయడం వల్ల విరాటుడి నుంచి ఎవరికీ ఏమీ దక్కేది కాదు.

అలా కొంత కాలం గడిచింది. విరాటుడికి పెద్దగా సంతోషం ఏమీ కలగలేదు. తప్పు చేసే వాళ్ళకు తనవల్ల ప్రయోజనం కలగనంతవరకూ బాగానే ఉంది. కానీ తప్పుకు శిక్ష పడవద్దూ? శిక్ష లేకుండా నేరస్థుడు బాగుపడతాడా?

విరాటుడు ఎక్కువగా నేరస్థుల గురించే ఆలోచించేవాడు. నేరస్థుడు తన వద్దకు వచ్చి మోసగించాలనుకుంటాడు. వేరు ప్రభావం వల్ల వాడికి తననుంచి ఏమీ దక్కదు. అప్పుడు నేరస్థుడు మరో మనిషిని మోసగించాలనుకుంటాడు. తనను మోసగించినందుకు వాడి ముఖం మచ్చపడాలి. లేదా మోసగించాలనుకున్నప్పుడల్లా కడుపులో నొప్పి పుట్టాలి. అలా జరిగితేనే నేరస్థుడు మారతాడు.

తానలా చేయలేకపోతున్నందుకు విరాటుడు బాధపడేవాడు. క్రమంగా వాడిలో దిగులు ఎక్కు-

వైంది. అలాంటి పరిస్థితిలో ఒక రోజున బైరాగి వాడి ఇంటి తలుపు తట్టాడు.

విరాటుడు బైరాగిని సాదరంగా ఆహ్వానించి తన దిగులుకు తరుణోపాయం అడిగాడు.

"ప్రపంచం ఒక పద్ధతిలో నడుస్తోంది. మనిషి, మనిషికిబ్బంది కలిగించకుండా ఉండడానికి ఎన్నో ఏర్పాట్లు చేసుకున్నాడు. తప్పు చేసిన వాళ్ళను పట్టుకుందుకు రక్షక భటులున్నారు. శిక్షించడానికి న్యాయాధికారులున్నారు. ఆపైన రాజు ఉన్నాడు. ఇంతమందినీ తప్పించుకున్న వాణ్ణి దేవుడు విడిచిపెట్టడు. కాబట్టి నువ్వు నేరస్థులను విడిచిపెట్టి మంచి వాళ్ళను ఆదుకో" అన్నాడు బైరాగి.

"అదే పని చేశాను. కానీ నాకు సంతోషం కలుగలేదు" అన్నాడు విరాటుడు.

బైరాగి క్షణం ఆలోచించి, "నీకు పరోపకారం ఎలా చేయాలో తెలియక సంతోషం కలుగడం లేదు. నీకు మాటలతో ఎంత చెప్పినా అర్థం కాదు. నాతో రా. ఒక మాసం రోజుల పాటు నన్నే గమనించు. పరోపకారం ఎలా చేయాలో తెలుస్తుంది" అన్నాడు. విరాటుడాయనతో వెళ్ళాడు.

ఇద్దరూ ఒక ఊరు చేరుకున్నారు. బైరాగి గురించి తెలిసిన చాలామంది ఆయన్ను చూడ వచ్చారు. బైరాగి వాళ్ళందరికీ తన వద్దనున్న సంచీ ఒకటి చూపి, "ఇది మాయ సంచీ! మీ అదృష్టం బాగుంటే ఇది మీమీ కోరికలను తీర్చు తుంది" అన్నాడు.

ముందుగా ఒక దీర్ఘ రోగి వచ్చాడు. బైరాగి



వాడికి సంచీలోంచి మందు తీసి ఇచ్చాడు. వాడికి వెంటనే నయమయింది. మరొకడికి బైరాగి సంచీ లోంచి వెయ్యి వరహాలు తీసిచ్చాడు. ఒక భక్తుడికి దేవుడి విగ్రహాలిచ్చాడు. ఒక విద్యార్థికి పుస్తకాలిచ్చాడు. ఒక రైతుకు విత్తనాలిచ్చాడు. ఇలా చాలామందికి రకరకాల వస్తువులిచ్చాడు.

అంతలో ఒక వృద్ధుడు వచ్చి, "అయ్యా! నా వయసు ఎనభై. నా మనుమరాలికి పన్నెండేళ్ళు. దానికి పెళ్ళై మునిమనుడిని ఎత్తుకునే దాకా నా ఆయువు కాపాడండి" అనడిగాడు.

బైరాగి నవ్వి "మనిషికి ఆయువు భగవన్నిర్ణయం. ఆ విషయంలో నేనెవరికీ సాయపడలేను. అన్నింటికీ భగవంతుడి మీద భారం వేయి" అని సలహాయిచ్చి ఆ వృద్ధుణ్ణి పంపేశాడు.



విరాటుడు దీనికి ఆశ్చర్యపడి, "తమరు ఘటనా ఘటన సమర్థులు. ఆరోగ్యాన్ని ప్రసాదించగల తమరు ఆయువుపోయలేరా?" అన్నాడు.

"నాయనా! నావద్ద ఉన్నదిస్తాను. లేనిదివ్వలేను" అని బైరాగి విరాటుడికి బదులిచ్చాడు.

అంతలో ఒకడు వచ్చి బైరాగిని లక్షవరహాలు కావాలని అడిగాడు. బైరాగి సంచీలోంచి నూరు వరహాలు తీసి వాడికిచ్చి, "నాయనా! నువ్వు అవసరానికి మించి డబ్బుడిగావు. నేను నీ అవసరానికి మాత్రమే ఇస్తున్నాను" అన్నాడు.

అంతే! వాడు బైరాగి వద్ద నుంచి ఒడుపుగా ఆ సంచీని లాక్కుని అక్కణ్ణించి పరుగెత్తాడు. విరాటుడు వాణ్ణి తరమబోతే బైరాగి వారించి, "ఆ సంచీ నాకు తప్ప వేరెవరికీ ఉపయోగపడదు. అత్యాశకు పోవడంవల్ల వంద వరహాలూ కూడా వాడికి దక్కవు" అంటూ ఆ దొంగ మీద జాలి కూడా పడ్డాడు.

"అలాగని దొంగను విడిచిపెడతామా? తమ సంచీని కాజేసినందుకు తమకు వాడి మీద కోపంగా లేదూ?" అన్నాడు విరాటుడు.

"నాయనా! ఏం చేయను? నా వద్ద కోపంలేదు-" అన్నాడు బైరాగి.

విరాటుడు తడబడి, "శక్తి ఉండీ నేరస్థుణ్ణి శిక్షించకపోవడం న్యాయంకాదు. తమకు కోపం లేకపోయినా వాడిని శిక్షించగల శక్తి ఉంది. కాబట్టి వెంటనే వాడిని శిక్షించండి" అన్నాడు.

"నా దగ్గర ఎదుటి వారు కోరినది వారి వారి అర్హతలకు అనుగుణంగా ఇవ్వగల శక్తి ఉన్న మాట నిజం. కానీ నావద్ద ఎవరికైనా ఇవ్వడానికి శిక్షలు లేవు. ఏం చేసేదీ - అసహాయుణ్ణి!" అన్నాడు బైరాగి.

"అయ్యో! అనవసరంగా ఒక నేరస్థుణ్ణి విడిచి పెట్టేశామే?" అంటూ విరాటుడు గొణుక్కుంటూంటే, "అసలా నేరస్థుడి వల్ల మనకే నష్టమూ కలుగలేదు కదా! ఎందుకూ విచారించడం?" అన్నాడు బైరాగి.

"శక్తి ఉన్నవాడు మంచి మనిషికి మంచి చేయాలి. చెడ్డ మనిషికి చెడు చేయాలి" అన్నాడు విరాటుడు.

బైరాగి నవ్వి " నీ మాటలు నీకే నవ్వు పుట్టించడం లేదూ?" అన్నాడు. విరాటుడు తెల్లబోయి చూస్తుంటే ఆయనిలా వివరించాడు,

"మంచి మనిషంటే ఎవరు? మంచి తనముండి చెడ్డతనం లేనివాడు. మంచితనమున్నవాడు మంచి చేయగలడు కానీ తనకు లేని చెడును ఎలా చేయగలడు? చేయగలిగితే వాడి దగ్గర చెడ్డతన ముందన్న మాట. చెడ్డతనమున్నవాడు చెడ్డవాడవుతాడు మంచి వాడు కాలేడు కదా!"

"అయ్యో స్వామీ! కోపం లేక, శిక్షించేందుకు మనసొప్పక, చెడు బొత్తిగా చేయలేక మీరు సంతోషంగా ఎలా ఉండగలరు?" అన్నాడు విరాటుడు.

"ఏమో నాయనా! ఒకప్పుడు నువ్వు చెప్పిన ఈ మూడు లక్షణాలూ నాలో ఉండేవి. అప్పుడు నేను దిగులుగా ఉండేవాణ్ణి. ఎంతో కష్టపడి వాటిని వదుల్చుకున్నాను. ఇప్పుడు నా వద్ద పొందాలన్నా దిగులులేదు అన్నాడు బైరాగి

అప్పటికి విరాటుడికి జ్ఞానోదయమయింది. వాడు తన దుష్ట బుద్ధికి తన్ను తనే నిందించుకో సాగాడు. బైరాగి వాడిని వారించి, "నీలో దుష్టబుద్ధి లేదు. దుష్టబుద్ధి ఉన్నవాడు తనకున్న దుష్టత్వాన్ని ఇతరులకు పంచిపెడుతూ చెడు చేసి సంతోషంగా ఉంటాడు. దుష్ట బుద్ధి లేనివాడు తనకు లేని చెడును ఇతరులకివ్వలేక అశక్తతతో బాధ పడుతూంటాడు. నీది సద్బుద్ధి. నీ కున్నది ఇతరుల కివ్వు. లేనిదివ్వాలని తాపత్రయ పడడం వల్ల నీలో దిగులు పుట్టింది. అది మానుకుంటే నువ్వూ సంతోషంగా ఉండగలవు. ఈ ప్రపంచంలో మంచివాడు మంచిపనులు చేసి మాత్రమే సంతోషంగా ఉండగలడు. చెడ్డవాడు చెడ్డపనులు చేసి మాత్రమే సంతోషంగా ఉండ గలడు. సంతోషంగా ఉండాలనుకునే వాడు తనకున్నవీ, లేనివీ తెలుసుకోవాలంతే!" అన్నాడు.

ఈ మాటలకు విరాటుడిక్కలిగిన సంతోష మింతా అంతా కాదు. బైరాగి తనను మంచి వాడన్నందుకే కాక మంచివాడెలాగుండాలో, పరోపకారం ఎలా చేయాలో తెలియడం కూడా వాడి సంతోషానికి కారణం. ఆ తర్వాత వాడినెప్పుడూ దిగులావ హించలేదు.



# జిజ్ఞాస

శివపురి రాజ్యంలో వేద వేదాంగాలు చదివిన సుధర్ముడు అనే పండితుడు ఉండేవాడు. అతని వద్ద శిష్యరికం చేయాలని చాలామంది ప్రయత్నించారు. సుధర్ముడు దైవ ధ్యానానికి ఎక్కువ సమయం వెచ్చించేవాడు. అందుకే ఎవరినీ శిష్యులిగా స్వీకరించలేదు.

కేదార నాథుడు అనే విద్యార్థికి సుధర్ముడి వద్ద శిష్యరికం చేయాలనిపించింది. అయితే సుధర్ముడా అవకాశం ఇవ్వడని తెలిసి ఒక రోజు అతన్ని కలసి "పండితోత్తమా! నాకు ముందూ వెనకా ఎవరూ లేరు. మీరింత ముద్ద పడేస్తే మీ సేవలు చేసుకుంటూ మీ వద్ద పడి ఉంటాను" అని వేడుకున్నాడు.

సుధర్ముడు అందుకు సమ్మతించాడు. కేదారనాథుడు గురువుగారికి ఏ వేళకు ఏది అవసరమో గుర్తించి సేవ చేసేవాడు. సుధర్ముడు, కేదారనాథుడికి అనేక విషయాలు వివరించేవాడు. క్రమేపీ కేదారనాథుడు, అతనితో చర్చలకు దిగేంత పాండిత్యం సంపాదించాడు.

ఒక రోజు కేదారనాథుడు, సుధర్ముడి పాదాలకు మస్కరించి, "గురువర్యా! నేనొక పాపం చేసాను. ురు శిష్యుడిగా స్వీకరించరని తెలిసి, సేవకుడిగా ేరి మీ వద్ద పాండిత్యం సంపాదించాను. మించండి" అన్నాడు.

సుధర్ముడు నవ్వి "నాయనా! నీవు నా వద్ద వకుడిగా చేరవచ్చినప్పుడే నాకా విషయం తెలుసు. వలు చేసైనా విద్య నేర్వాలన్న నీ జిజ్ఞాస గ్రహించబట్టే న్ను ఆదరించాను" అన్నాడు.

కేదారనాథుడు భక్తి ప్రపత్తులతో గురువు పాదాలకు మస్కరించాడు. — ఎన్. శివనాగేశ్వరరావు.



# బొమ్మరిల్లు ముచ్చట్లు

## కంచు మ్రోగినట్లు....

కంచు మ్రోగినట్లు కనకంబు మ్రోగునా అన్నాడు వేమన యోగి. ఇది నిజమని ఎన్నోసార్లు ఋజువయింది. అలాంటిదే అతిపెద్ద వజ్రం కథ. ప్రపంచంలోకల్లా అతి పెద్ద వజ్రం ఈ శతాబ్దారంభంలో (1905) దక్షిణాఫ్రికా వజ్రాల గనుల్లో దొరికింది. స్వచ్ఛమైన తెలుపురంగులో 3,106 క్యారెట్ల బరువున్న ఈ వజ్రాన్ని ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం లక్షా యాభైవేల పౌండ్లకు కొంది. అప్పటి బ్రిటిష్ చక్రవర్తి ఏడవ ఎడ్వర్డుకు ఆయన 66వ జన్మదిన కానుకగా ఆ వజ్రాన్ని పంపాలని ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం అనుకుంది. అయితే అంత ఖరీదైన వజ్రాన్ని భద్రంగా లండన్ చేర్చేదెలా అన్నది వారి సమస్య. వజ్రమున్న అందమైన పెట్టెకు సాయుధులైన భటులను కావలా ఉంచారు. ఆ పెట్టె ప్రెటోరియా నుంచి కేప్‌టౌన్ దాకా రైలు ప్రయాణం చేసింది. అక్కణ్ణుంచి లండన్‌దాకా ఓడ ప్రయాణం. రక్షకభటులు క్షణం కూడా దృష్టి మరల్చక అప్రమత్తులై పెట్టెను కావలాకాశారు. ఓడ లండన్ చేరుకునే సరికి - ఒక ప్రత్యేకమైన కారు వచ్చింది - పెట్టెను బ్యాంకు లాకర్లో ఉంచడానికి! పెట్టె బ్యాంకు చేరుకున్నాక - బ్యాంకు అధికారులందరికీ ప్రపంచంలో అతిపెద్దదైన ఆ వజ్రాన్ని చూడాలని కుతూహలం పుట్టింది. కానీ పెట్టె తెరచి చూస్తే అందులో ఉన్నదో బొగ్గు ముక్క. అసలు వజ్రం ఎవరికీ తెలీకుండా ఏ హడావుడీ లేకుండా పోస్టులో వచ్చింది. ఎవరికీ అనుమానం రాకుండా ఆ వజ్రాన్నో ఎర్రచేప కడుపులో పెట్టి పోస్టు చేశారు. తర్వాత ఆ వజ్రాన్ని 105 ముక్కలు చేస్తే అన్నింట్లోకీ పెద్దది 530 క్యారట్లుంది. ఆఫ్రికా నక్షత్రంగా (కుల్లినాన్ - 1) పిలువబడే ఈ వజ్రం బ్రిటిష్ రాజుల రాజముద్రికల నలంకరిస్తూ ఉంది.



"వసుంధర"

## ప్రాణాంతకపు ఆట

రోమ్‌లో పూర్వం బానిసల యుద్ధాలు జరిగేవి. ఇద్దరు వీరులు ప్రాణాలు పోయేదాకా ఒకరితో ఒకరు పోరు సలపాలి. ఆ వీరుల్ని గ్లాడియేటర్లు అనేవారు. ఈ పోరాటాన్ని వేలాది రోమను ప్రేక్షకులుత్సాహంగా తిలకించేవారు. ఇది అమానుషమని ఎందరో ఘోషించగా క్రీ.శ. 326లో కాన్‌స్టాంటీన్ చక్రవర్తి ఈ క్రీడను నిషేధించాడు. కానీ మన వరకట్న నిషేధంలాగే ఇదీ అంతలా పనిచేయలేదు. ఎక్కడో ఒకచోట ఈ క్రీడలు జరుగుతూనే ఉండేవి. క్రీ.శ. 404లో టెలిమాచూస్ అనే సాధువిది భరించలేక ఒక సాహసం చేశాడు. ఒకరోజున ఆయన ప్రాణాంతకంగా పోరాడుతున్న ఇద్దరు వీరుల మధ్య చొరబడి వారిని విడదీశాడు. ప్రేక్షకులక్కోపం వచ్చి ఆయన్ను రాళ్ళు విసిరి చంపేశారు. అయితే ఆయన ఆత్మబలి వృధాపోలేదు. ఈ సంఘటన ఎందరి ఆలోచనలనో మార్చింది. ఆ తర్వాత రోమ్‌లో ఇలాంటి క్రీడలు జరగలేదు.





## తానొకటి తలిస్తే...

ఆంద్రీ ఫ్రాంకాయిస్ రాఫ్రే తెలివైన లాయరు. ఆయన వయసు 47 అయినపుడో తెలివైన పని చేశాడు. జీన్ కాల్మెంట్స్ అనే 90 ఏళ్ళ వృద్ధురాలి ఇంటిమీద ఆయన కన్నుపడింది. నువ్వు బ్రతికున్నంత కాలం నెలకు 2,500 ఫ్రాంకులిచ్చుకుంటాను, నీ తదనంతరం నీ ఇల్లు నా కిస్తావా అన్నాడు. ఆమె సరేనంది. మే 1965లో ఇద్దరూ ఒప్పందం కాగితాల మీద సంతకాలు చేసుకున్నారు. ఏ క్షణంలోనైనా ఆ ఇల్లు తనది కావచ్చునని కలలు కంటూ ఆ లాయరు 30 సంవత్సరాలు గడిపేశాడు. మొత్తం 9,20,000 ఫ్రాంకులా విధంగా కాల్మెంట్స్ పరమయ్యాయి. అంటే రూపాయల్లో సుమారు 60 లక్షలు. 1995లో క్రిస్మస్ రోజున 77 ఏళ్ళ వయసులో లాయరుగారు తనువు చాలించారు. అక్టోబర్లో జీన్ కాల్మెంట్స్‌కి 120 ఏళ్ళు నిండాయి. అంత డబ్బూ తీసుకున్నాక కూడా ఆ ఇల్లు ఆమెకే మిగిలింది. పాపం లాయరుగారు - ఇలా జరుగుతుందని ఊహించి ఉండడు. తానొకటి తలిస్తే దైవమొకటి తలిచింది...



## కల్ల నిజమాయె!

పూర్వం గ్రీకు దేశంలో ఓరకిల్ అనబడే దేవాలయాలుండేవి. అక్కడ పూజారులకు దేవుళ్ళు పూనేవారు. పూనకంలో ఉన్న పూజారులు భక్తులకు సలహాలు, సూచనలు ఇచ్చేవారు. భవిష్యత్తు చెప్పేవారు. డెల్ఫీలో అపోలో దేవుడికో గుడి అలాంటిదే ఉంది. యాభై ఏళ్ళు పైబడ్డ స్త్రీల లోంచీ ఒకామెను "పిథియా"గా ఎన్నుకునేవారు. పిథియాగా ఎన్నుకోబడిన స్త్రీ భర్తను త్యజించి ఆలయానికంకితమైపోవాలి. ఈ డెల్ఫీ గుడిలో ప్రశ్న అడగాలని ఎందరో వచ్చి పెద్దపెద్ద క్యూలలో నిలబడేవారు. ఎంత డబ్బైనా ఇచ్చేవారు. పిథియాలు భవిష్యత్తు గురించి చెప్పే మాటలు నర్మగర్భంగా ఉండేవి. ఎలా కావాలంటే అలా సర్ది చెప్పుకునేటంత తెలివిగా ఉండేవి. ఒకసారి వారి భవిష్యద్వాణి ఖచ్చితంగా అమలు జరిగేది. ఇందుకు దృష్టాంతంగా డాఫ్నిటాస్ అనే గ్రీకు పౌరుడి కథ చెబుతారు. అతగాడు పిథియాని, "నా గుర్రమెప్పుడు దొరుకుతుంది?" అనడిగాడు. అందుకు పిథియా, "నీ గుర్రం దొరుకుతుంది. కానీ దానిమీంచి విసిరివేయబడతావు" అని బదులిచ్చింది. డాఫ్నిటాస్‌కి గుర్రమే లేదు. అందుకని పిథియాలదంతా బూటకమని అతడన్నాడు. ఆ తర్వాత కొద్దిరోజులకే ఎందుకో రాజుకతడి మీద కోపమొచ్చింది. ఓ బండరాతి మీంచీ అతణ్ణి విసిరేయమని శిక్ష విధించాడు రాజు. స్థానికులా బండరాతిని గుర్రమని వ్యవహరించే వారు. పిథియా మాట నిజమయింది.

## అంతులేని ఆట

ఇది 1939లో జరిగింది. ఇంగ్లండు క్రికెట్ జట్టు దక్షిణాఫ్రికాలో పర్యటించింది. మొదటి టెస్టు నెగ్గింది. తర్వాత మూడు టెస్టు పోటీలు డ్రా అయ్యాయి. దర్బాన్లో చివరి టెస్టు ఆడాలి. సాధారణంగా టెస్టు పోటీ అయిదురోజు లుంటుంది. అటో ఇటో తేలిపోవాలి కాబట్టి ఈ చివరి టెస్టు ఎన్నాళ్ళయినా సరే ఆడాలని వాళ్ళను కున్నారు. అలా పదకొండు రోజులు గడిచాయి. ఆట పూర్తికాలేదు. అంతలో ఇంగ్లండు జట్టును స్వదేశానికి తీసుకుని వెళ్ళే ఓడ ప్రయాణానికి సిద్ధంగా ఉంది. అప్పటికి ఇంగ్లండు జట్టు విజయానికి దగ్గర్లో ఉంది. 42 పరుగులు చేయాలి. ఇంకా అయిదు వికెట్లున్నాయి. కానీ ఓడ వారి కోసం ఆగదు. పోటీని డ్రాగా ప్రకటించి ఆటను నిలుపుచేశారు.



## ఇండియా టుడే

తెలుగువారు పుస్తకాలు కొని చదవరని పేరు. తెలుగువారే కాదు - భారతీయులందరూ ఇంచు మించు అంతే! అలాంటప్పుడేదైనా పత్రిక విప రీతంగా అమ్ముడుపోతే అది పెద్ద విశేషమే. ఇండియా టుడే 1975 డిసెంబర్లో ప్రారంభ మయింది. అప్పుడది అయిదువేల కాపీలు అమ్ముడుపోయింది. ఇరవై ఏళ్ళ తర్వాత ఇప్పుడది నాలుగు లక్షలకుపైగా అమ్ముడుపోతోంది. ఇంగ్లీషులో ప్రారంభమైన ఈ పత్రిక ఇప్పుడు హిందీ, తమిళం, తెలుగు, మలయాళం, గుజరాతీ భాషల్లో కూడా వస్తోంది. నాలుగు అంతర్జాతీయ సంపుటాలూ వస్తున్నాయి. ఇవన్నీ కలిపితే అమ్మకం 11 లక్షలు దాటుతుంది. ఒక్క ఇంగ్లీషు సంచికనే యాభై లక్షల మందికిపైగా చదువుతారనీ, అన్ని సంపుటాలూ కలిపితే ప్రతి సంచికనూ కోటిమందిపైగా చదువు తారనీ అంచనా! ఇందులో లక్షోవంతు అదృష్టం కోసం ఎన్నో పత్రికలు కలలు కంటున్నాయి మరి...






## జుంబో కథ

విమానాల్లో పెద్దదాన్ని జుంబో జెట్టు విమానం అంటారు. ఎక్కడ పెద్ద వస్తువున్నా జుంబో సైజు అంటారు. ఈ జుంబో అన్న పదం గత శతాబ్దంలో లండన్ జంతు ప్రదర్శన శాలలో ఉండే ఒక ఆఫ్రికన్ ఏనుగు పేరు. 3.4 మీటర్ల పొడవున్న ఈ ఏనుగు బరువు ఆరున్నర టన్నులు. ఎక్కడెక్కడి జనం దీన్ని చూడ్డానికి వచ్చేవారు. పిల్లలు దీనిమీద సవారీ చేసి వినోదించేవారు. వయసు ముదిరిన కొద్దీ జుంబోలో సహనం తగ్గి చిరాకు ఎక్కువయింది. జూలో ఉంటే ప్రమాదమని అధికారులు దీన్ని బార్నుమ్ అనే సర్కస్ యజమానికి అమ్మారు. బార్నుమ్ జుంబోను అమెరికా తీసుకుని వెళ్ళి ఎన్నో ప్రదర్శన లిప్పించారు. బార్నుమ్ సర్కస్‌లో జుంబో ఒక పెద్ద ఆకర్షణ. అయితే 1885లో జుంబో రైలు ప్రమాదంలో మరణించింది. జుంబోతోపాటు రైలింజను డ్రైవరు కూడా మరణించాడు. ఆ డ్రైవరెవరో ఇప్పటికీ ఎవరూ తల్చుకోరు. కానీ జుంబో పేరు ఆంగ్ల నిఘంటువులో భారీ పరిమాణానికి మారు పేరుగా శాశ్వతస్థానం సంపాదించుకుంది.





# శివధనుస్సు

మిథిలా నగారాన్నేలే జనక మహారాజు అను కూలవతియైన భార్య రత్నమాలతో కాపురం చేస్తూ కూడా రాజాయోగిగా పేరు తెచ్చుకున్నాడు. మహా పరాక్రమవంతుడైన జనకుడు దేవదానవ యుద్ధాలలో దేవతలకు సాయపడుతూ ఇంద్రుడి స్నేహం సంపాదించుకున్నాడు.

జనకుడు విష్ణు భక్తుడు. విష్ణువాయన భక్తికి సంతోషించి ఎల్లవేళలా కాపాడతానని మాట కూడా ఇచ్చాడు.

ఒకసారి జనకుడు విజయ యాత్ర ముగించుకుని తిరిగి వస్తూ, కైలాస ప్రాంతంలోని రుద్రవనంలో విడిది చేశాడు. ఆ వన సౌందర్యానికి ముచ్చట పడుతూ, చీకటి పడిన విషయం కూడా గమనించకుండా విహరిస్తూన్న జనకుడికి ఓ అద్భుత దృశ్యం కనబడింది. చంద్రకాంత మణిని శిరసుమీద ధరించిన ఒక మహా సర్పం ఆ వనంలో ప్రవేశించింది. తన చంద్రకాంత మణిని పొదలో దాచి కాసేపు వన విహారం చేసింది. కాసేపటికి మళ్ళీ తన మణిని ధరించి అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

అప్పుడు జనకుడిలో కుతూహలం రేగింది. ఆయన తన మిత్రుడైన ఇంద్రుణ్ణి ప్రత్యక్షం చేసుకున్నాడు. ఇద్దరూ కాసేపు పిచ్చాపాటీ కబుర్లు చెప్పుకున్నాక జనకుడు తను చూసింది చెప్పి సర్వం వివరాలడిగాడు.

ఇంద్రుడు నవ్వి, "ఆ చంద్రకాంత మణి శివుడిది. అదాయన ఆదిశేషునికి కానుకగా ఇచ్చాడు. భూభారం మోసే ఆదిశేషువు తన అంశం లోంచీ ఒక దివ్య సర్పాన్ని సృష్టించి చంద్రకాంత మణికి రక్షణగా నియమించాడు. ఆ సర్పం రుద్రవనంలో ఆహారం వెతుక్కుంటుంది. ఆ సమయంలో తప్ప మణిని విడిచిపెట్టదు. ఎవరైనా ఆ మణిని కావాలనుకుంటే శివుడితో విరోధాన్ని కొనితెచ్చుకున్నట్లే! అని చెప్పాడు.

"ఎవరి విషయమో వేరు. నన్ను శ్రీమన్నారాయణుడు ఎల్లవేళలా కాపాడతానని మాటిచ్చాడు.

అపూర్వ గాథలు



అలాంటి నన్ను శివుడూ గౌరవిస్తాడు తప్ప నాతో విరోధం పెట్టుకోవాలనుకోడు. సర్పం రోజూ కొంత సేపు ఆ మణిని విడిచి ఉంటోంది. ఆ సమయంలో మణికి రక్షణ లేదు. నా వద్ద ఉంటే మణికి అన్ని వేళలా రక్షణ ఉంటుంది. రాజునైన నావద్ద ఆ మణి ఉన్నందుకు శేషుడు, శివుడు కూడా సంతోషిస్తారు" అన్నాడు జనకుడు ఇంద్రుడి మాటలను ఖండిస్తూ.

"నేను చెప్పవలసింది చెప్పాను. సర్వజ్ఞుడివి. నీకు తెలియనిదేముంది? లేని విరోధం తెచ్చుకుంటావో, ఆదిశేషుణ్ణి ప్రార్థిస్తావో అంతా నీ ఇష్టం. నీ వంటి రాజు అడిగితే ఆదిశేషుడు కాదంటాడా, ఆలోచించుకో!" అని హితవు చెప్పి మాయమయ్యాడు.

ఆదిశేషుడు మణిని దివ్య సర్పానికిస్తే, ఆ సర్పం మణిని నిర్లక్ష్యం చేస్తోందని జనకుడికి బాధ కలిగింది. ఈ విషయం ఆదిశేషువు గ్రహించాలంటే తను మణిని సంగ్రహించడమే మార్గమని ఆయన అనుకున్నాడు.

మరునాడు జనకుడు మాటువేసి సర్పం చంద్రకాంత మణిని పొదలో దాచి కనుమరుగు కాగానే తానా మణిని స్వంతం చేసుకుని శిబిరంలోకి వెళ్ళిపోయాడు. కాసేపటికి సర్పం తిరిగి వచ్చి మణి కనిపించక కోపంతో బుసలు కొడుతూ జనకుడి శిబిరాన్ని చేరుకుంది. ఆ సర్పాన్ని చూసి, రాజభటులు కకావికలైపోయారు.

అప్పుడు కలకలం విన్న జనకుడు ఖడ్గధారియై వచ్చి సర్పాన్నెదుర్కొని ముక్కలు ముక్కలుగా నరికాడు. అప్పుడా సర్పం ఒక దివ్యపురుషుడిగా మారి, "జనకమహారాజా! ఆదిశేషువు అంశను. నావల్ల నిర్లక్ష్యమూ ఉండదు. మహావిష్ణువు భక్తుడవు. నీవల్ల అపచారమూ జరుగదు. అన్నింటికీ కారణాలుంటాయి. నేను కావాలనే నీకు మణితో కనిపించాను. అనుకున్నట్లుగానే నీ ఆలోచనలు పని చేశాయి. రావణ వధ చేయడానికి శ్రీ రాముడవతరించబోతున్నాడు. లక్ష్మీదేవి సీతాదేవిగా పుట్టి శ్రీరాముణ్ణి వివాహమాడ్డంలోనే రావణవధ మర్మమున్నది. అందుకిప్పట్నించీ సన్నాహాలు జరుగుతున్నాయి. మణిని నీవద్ద విడిచి వెడుతున్నాను. కానీ ఇంతటితో నిన్ను వదిలిపెట్టను. నీపై పరమశివునికి ఫిర్యాదు చేయడం నా బాధ్యత. పరిణామాలకు భయపడకు.

కానీ సిద్ధంగా ఉండు" అని మాయమయింది.

"నేను రాజధర్మం నిర్వహించాను. ఎవరికీ అపచారం చేయలేదు కొబట్టి నాకు భయం లేదు" అనుకున్నాడు జనకుడు.

ఈలోగా సర్పం దివ్యపురుషుడి రూపంలో శివుడి వద్దకు వెళ్ళి జరిగినదంతా చెప్పింది. అప్పుడు భోళాశంకరుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. ఆయన ప్రమథగణాలను వెంటబెట్టుకుని మహా కోపంతో అట్టహాసంగా ధనువును చేత ధరించి రుద్రవనానికి ప్రయాణమయ్యాడు.

ఈ విషయం ఇంద్రుడికి తెలిసింది. జనకుడన్నంత పనీ చేశాడు. నారాయణుడాయన్ను అన్న మాట ప్రకారం కాపాడుతూనే ఉంటాడు. శివుడితో యుద్ధం చేస్తే అది శివకేశువుల యుద్ధంగా మారుతుంది. అది ప్రళయానికి దారి తీస్తుంది. ఈ యుద్ధాన్నాపడమెలాగా అని ఇంద్రుడాలోచించాడు. అయితే శివకేశువుల మధ్య దూరే ధైర్యం చేయలేక ఆయన నారదుణ్ణి తల్చుకున్నాడు.

నారదుడు ప్రత్యక్షమై, "ఇప్పట్లో దేవదానవ యుద్ధాలున్నట్లు లేదు. నన్నెందుకు తల్చుకున్నావు" అన్నాడు.

"అంతకంటే ప్రళయ భీకరమైన యుద్ధమొకటి ఇప్పుడు వచ్చి పడింది. దీన్నాపకపోతే అనంత విశ్వానికే ముప్పు" అంటూ ఇంద్రుడు జరిగిందంతా నారదుడికి చెప్పాడు.

నారదుడు నవ్వి, "ఒకరు భోళాశంకరుడు, ఇంకొకరు కపట నాటక సూత్రధారి. వీరి మధ్య యుద్ధాన్నాపడం నారదునికి చిటికెలపై పని — అయినా అంతా ఆ నారాయణుడి లీల" అను



కుంటూ అక్కణ్ణించి బయల్దేరి రుద్రవనం చేరుకున్నాడు.

అప్పటికి జనకుడు, శివుడు ఒకరికొకరు ఎదురుగా ఉన్నారు. శివుడు మణి నిమ్మంటే జనకుడు నిరాకరించాడు. జనకుడిచ్చే సంజాయిషీని శివుడు పట్టించుకోక, "నాకు సంజాయిషీ వద్దు. మణి కావాలి. లేదా యుద్ధం చేయి" అంటూ ధనుష్టంకారం చేశాడు. అంతే!

జనకుడొక్కడుగు ముందుకు వేసి శివధనుస్సును లాక్కున్నాడు. అప్పుడు శివుడు తెల్లబోయాడు. ఆయన కోపం పట్టలేక శూలాన్ని విసరబోయాడు.

ఈలోగా నారదుడు కుమారస్వామి చెవిలో ఏదో చెప్పాడు. కుమారస్వామి తండ్రిని శూలం విసరకుండా ఆపి, "తండ్రీ! ఈ యుద్ధం జరగడం శ్రీమన్నారాయణుడికిష్టం లేదు. ఆయన అదృశ్యంగా ఉండి జనకుడి నావహించి విల్లును లాక్కున్నాడే తప్ప జనకుడేం చేయలేదు. శ్రీమన్నారాయణుడికి నీపై గౌరవం. అందుకే ప్రత్యక్ష యుద్ధానికి రాలేదు." అన్నాడు.

అప్పుడు శివుడు భవిష్యత్తులోనికి చూసి అసలు విషయమ తెలుసుకుని శాంతించాడు. ఆయన జనకుడితో, "జనకా! నాకూ విష్ణువుకూ భేదం లేదు. నీవు విష్ణు భక్తుడివి కాబట్టి నా భక్తుడివి కూడా! నా విల్లు ఈ క్షణం నుంచీ నీదవుతుంది. అయితే నీకు దీన్ని విరిచే అధికారం లేదు. నీ ఇంట పవిత్ర స్థానంలో ఉంచి భక్తి శ్రద్ధలతో పూజించు. నీ ఇంట సీతగా వెలయనున్న శ్రీ మహాలక్ష్మిని వివాహమాడేందుకు శ్రీ మహా విష్ణువు నర రూపాన్నెత్తుతాడు. వారి వివాహానికీ ధనుస్సు ప్రయోజనపడుతుంది. మణికి రక్షణ కల్పించాలన్న నీ సంకల్పం మంచిది. అలాగే చేయి" అని మాయమయ్యాడు.

ఆ విధంగా జనకుని చేరిన శివధనుస్సు - సీతా కళ్యాణ ఘట్టంలో ఏ విధంగా ఉపయోగ పడినదీ రామాయణం చదివిన, విన్నవారందరికీ తెలిసిన విషయమే కదా! — జె. మార్కండేయులు






ఎంతో అందంగా ఉంటుందని ముచ్చటపడి రంభను పెళ్ళి చేసుకున్నాడు వీరయ్య. తీరా చూస్తే ఆమె పరమ గయ్యాళి. అయిందానికీ కానిదానికీ భర్తతో ఏదో గొడవ పెట్టుకుంటూండేదామె.

కొన్నాళ్ళకా దంపతులకు సూరయ్య అనే కొడుకు పుట్టాడు. వాడు మహా పెంకివాడుగా తయారయ్యాడు. రంభ వీరయ్యను మాత్రమే వేధించేది. సూరయ్య వీధిలో వారందరితో గొడవలు తెచ్చేవాడు. దాంతో వీరయ్యకు మనశ్శాంతి కరువయింది.

ఒకరోజున వీరయ్యను రంభ నానామాటలూ అని తిట్టింది. వాడికి మనసు పాడై ఎక్కడికైనా పోదామనుకుంటున్నంతలో చుట్టుపక్కల వాళ్ళు సూరయ్య మీద పితూరీలు తెచ్చి నానా మాటలూ అన్నారు.

ఇక వీరయ్యకు జీవితమంటే విరక్తి పుట్టింది. వాడు ఇంట్లో చెప్పాచెయ్యకుండా ఊరు వదిలి అడవిదారి పట్టాడు. కొద్దిరోజులా అడవిలో తిరిగేక వాడికో ఆశ్రయం కనబడింది. అది పూర్ణతేజుడనే సాధువుది.

వీరయ్య పూర్ణతేజుడి కాళ్ళమీద పడి తన కథంతా చెప్పుకుని ఆయన్ను సన్యాసమిప్పించమని కోరాడు.

"నాయనా! నీ భార్యాబిడ్డలు అల్లరివారైనా అన్నింటికీ నీ మీద ఆధారపడ్డవారు. నువ్వు లేకుంటే వారేమైపోతారు. వెనక్కువెళ్ళి వారిని సక్రమమైన దారిలో పెట్టు. సుఖంగా జీవించు" అన్నాడు పూర్ణతేజుడు.

"స్వామీ! ఆ జీవితంతో విసిగిపోయాను. అక్కడ నాకు మనశ్శాంతి లేదు. తమరు నాకు సన్యాసమిప్పిస్తారా సరేసరి! లేకుంటే ఆత్మహత్యే దిక్కు!" అన్నాడు వీరయ్య చివరి మాటగా.

పూర్ణతేజుడప్పటి కింకేమీ అనక వీరయ్యను ఆశ్రమంలో ఉండనిచ్చాడు. అలా కొద్దిరోజులు గడిచాయి.

ఒకరోజు రాత్రి సాధువు చిన్న కాగడా తెచ్చి,

జె.యస్. మోహనరావు

"నాయనా! నా జపమాల కనిపించకుండా ఉంది. వెదకడానికి నాకు సాయం వస్తావా?" అన్నాడు.

వీరయ్య సరేనన్నాడు. ఇద్దరూ కలిసి ఆశ్రమం చుట్టూ ఉన్న తోటంతా వెదికారు. పొద పొదనూ గాలించారు. ఎక్కడా జపమాల కనిపించలేదు.

"చిత్రంగా ఉందే - ఎంత వెదికినా కనపడ లేదు -" అన్నాడు వీరయ్య ఆశ్చర్యపడుతూ.

"జపమాల లేనిదే జపం కుదరదు. రేపటి విషయమెలాగా అని నాకు చింతపట్టుకుంది" అన్నాడు పూర్ణతేజుడు దిగులుగా.

"స్వామీ! బాగా గుర్తుచేసుకోండి. జపమాల ఎక్కడపోయిందో తెలిస్తే ప్రత్యేకంగా అక్కడే వెదకవచ్చు" అన్నాడు వీరయ్య.

"నాకు బాగా జ్ఞాపకముంది నాయనా! జపమాల ధ్యానమందిరంలో పోయింది" అన్నాడు సాధువు.

వీరయ్య పెద్దపెట్టున నవ్వి "అయ్యో తమరింత వెర్రేమిటి స్వామీ! ధ్యానమందిరంలో పోయిన మాలను పూలతోటలో వెతికితే కనబడు తుందా?" అన్నాడు.

"అయితే అలా చేయడం తెలివితక్కువతన మనీ, కూడదనీ అంటావు. అవునా?" అన్నాడు పూర్ణతేజుడు.

"నిస్సందేహంగా!" అన్నాడు వీరయ్య.

"అయితే నువ్వు నీ ఇంట్లో పోగొట్టుకున్న మనశ్శాంతిని వెతుక్కుంటూ ఇంతదూరమెందు కొచ్చావు?" అన్నాడు పూర్ణతేజుడు.

అప్పటికి వీరయ్యకు పూర్ణతేజుడి ఉద్దేశ్యం అర్థమయింది. వాడు సాధువు వద్ద సెలవు తీసుకుని తన ఊరు తిరిగివెళ్ళాడు. అప్పటికి తండ్రి కోసం సూరయ్య, భర్త కోసం రంభా బెంగపెట్టుకుని చిక్కి సగమయ్యారు. వాళ్ళకు బాగా బుద్ధి రావడంతో వీరయ్య జీవితం సుఖమయ మైంది. ఎక్కడపోయిందో అక్కడే వాడికి మనశ్శాంతి దొరికింది.





# పుణ్యపురం

రమణయ్యకు చిన్న తనంలోనే తలిదండ్రులు పోయారు. అయిన వాళ్ళెవ్వరూ చేరదీయలేకపోతే ఒక వ్యాపారి పంచన వేశాడు. వాడి చురుకుతనం, తెలివి తేటలు వ్యాపారికి నచ్చాయి. అందుకని వాడికాయన అలాంటిలాంటి పనులు చెప్పక వ్యాపార రహస్యాలు నేర్పుతుండేవాడు.

రమణయ్య మంచివాడు. విశ్వాస పాత్రుడు. వ్యాపారి వాడిచేత అన్నిపనులు చేయించుకుని చాలా తక్కువ ప్రతి ఫలాన్నిచ్చేవాడు. అందువల్ల ఎన్నేళ్ళు గడిచినా వాడిది గొర్రెతోక జీవిత మయింది.

వ్యాపారికి చక్కని చుక్కలాంటి కూతురుంది. ఆమెను రమణయ్యకిచ్చి పెళ్ళిచేస్తే వాడు ఇల్లరికపు టల్లుడై తన ఇంటికి కట్టుబడి ఉంటాడని వ్యాపారి అనుకున్నాడు. ఒక రోజున రమణయ్యకా విషయం చెప్పాడు.

వ్యాపారి కూతురు మితిమీరిన గారాబంతో పెరిగింది. రమణయ్యనామె ఇంట్లో మనిషిలా కాక పని వాడిలా చూసేది. అయినదానికీ. కాని దానికీ తిడుతూండేది. ఆమె బాధ పడలేక వాడా ఇల్లు వదిలి పోవాలనుకున్నాడు కానీ వ్యాపారి పట్ల కృతజ్ఞత వాణ్ణి కట్టి పడేసింది.

ఇప్పుడు వ్యాపారి వివాహం ప్రసక్తి తెచ్చేసరికి రమణయ్య తెలివిగా, ‘‘అయ్యా! తమరు నాకు తండ్రి వంటి వారు. మీ కూతురు నాకు చెల్లి వంటిది. మా ఇద్దరికీ పెళ్ళి అంటే ఊహలో కూడా భరించలేను’’ అన్నాడు.

ఈ మాటలకు వ్యాపారిక్కోపంవచ్చి, ‘‘ఇలాంటి కబుర్లు నాకు నచ్చవు. ఎవరికైనా మామ తండ్రి వంటి వాడే! మేనమామ కూతురు చెల్లివంటిదే! పెళ్ళికి మరదలు తగినదేనని మన సంప్రదాయం చెబుతుంది. నేను నీకు తండ్రి వంటి వాడినే కానీ మామను. ఈ విషయం గ్రహించి వెంటనే ఈ పెళ్ళికి ఒప్పుకో. లేదా కట్టుగుడ్డలతో నా ఇంట్లోంచి వెళ్ళిపో!’’ అన్నాడు.

వ్యాపారిని శాంత పర్చాలని రమణయ్య

జె. రామలక్ష్మి వసుంధర



కాసేపు విఫలయత్నాలు చేసి చివరకు విసిగి పోయి, "అయ్యా! మీరు నన్ను చేరదీసి ఆదరించారు. అందుకు కృతజ్ఞుణ్ణి. అంత మాత్రాన నావల్ల మీరు ప్రయోజనం పొంద లేదని కాదు కదా! నా కారణంగా మీ వ్యాపారం రెట్టింపయింది. లాభాలు పెరిగాయి. నన్నింట్లోంచి పంపేసే ముందు నాకు కొంచెం డబ్బివ్వడం న్యాయం!" అన్నాడు.

దీనికి వ్యాపారి మరింత మండిపడి, "నీకు తిండిపెట్టినందుకు భోజనం ఖర్చు, ఉండనిచ్చి నందుకు ఇంటి అద్దె, వ్యాపార రహస్యాలు నేర్పి నందుకు గురుదక్షిణ వగైరాలన్నీ కలుపుకుంటే నువ్వే నాకు ఇంకా వెయ్యి వరహాలు బాకీ అది వదులుకుంటున్నాను, పో!" అన్నాడు.

ఆయన తనకు డబ్బివ్వడని రమణయ్యకు అర్థమై పోయింది. వాడు నిట్టూర్చి అక్కణ్ణించి కదిలాడు.

వ్యాపారి రమణయ్యను ఇంట్లోంచి పంపేశాడని ఊరందరికీ తెలిసింది. అందుకందరూ రక రకాల కారణాలు గుసగుసలుగా చెప్పుకున్నారు. రమణయ్య మంచి తనం గురించి తెలిసిన వారు కూడా సానుభూతితో సాయం చేయడానికి ముందుకురాలేదు.

ఆ ఊళ్ళో సీత అనే పేద యువతి ఉంది. ఆమెకు నా అన్న వాళ్ళు లేవు. రకరకాల పిండివంటలు చేసి సంతలో అమ్ముకుని ఆ వచ్చే డబ్బులో ఎలాగో రోజులు వెళ్ళబుచ్చు తోంది. ఆమెకో పూరి గుడిసె ఉంది.

సీత రమణయ్యను కలుసుకుని, "నన్ను పెళ్ళిచేసుకో. నా పూరి గుడిసె నీకు నిలువ నీడనిస్తుంది. నేను నీ చెప్పు చేతల్లో ఉంటాను. నీ తెలివి తేటలతో నా వ్యాపారాన్ని వృద్ధి చేయి. మనం బాగుపడతాం" అంది.

ఏ ఆధారమూ లేని రమణయ్య కీ మాటలు నచ్చాయి. వాడు సీతను పెళ్ళి చేసుకున్నాడు. తన తెలివి తేటలతో ఆమె వ్యాపారాన్ని వృద్ధి చేసి పూటకూళ్ళ ఇల్లుగా మార్చాడు. ఆ లాభాలతో ఇతర వ్యాపారాలు ప్రారంభించి. అయిదేళ్ళు తిరిగే సరికి లక్షాధికారి అయ్యాడు. అప్పటికి వాడికిద్దరు కొడుకులు కలిగారు.

తన జీవితం ప్రశాంతంగా గడిచిపోవాలని రమణయ్య కోరిక కానీ సీత అప్పటికి ఉన్న దాంతో తృప్తిపడక ఇంకా ఇంకా సంపాదించాలనేది.

"ఒకప్పుడు మనది పూరి గుడిసె. ఇప్పుడు మేడలో ఉంటున్నాం. ఒకప్పుడు పిండివంటలు చేసి అమ్మేవాళ్ళం. ఇప్పుడు పనివాళ్ళ చేత పిండివంటలు చేయించుకుని తింటున్నాం. ఇంతకంటే ఇంకా ఏం కావాలి?" అని రమణయ్య అప్పుడప్పుడు భార్యమీద విసుక్కునేవాడు.

"చేతనైన వాళ్ళు ఎంతైనా సంపాదించు కుంటారు. చేతగాని వాళ్ళు ఉన్నదాంతో తృప్తి పడతారు. నీ సమర్థత తెలిసే నిన్ను ఏరికోరి పెళ్ళి చేసుకున్నాను. నా ఆశ నిరాశ చెయ్యకు" అంది సీత.

అవసరానికి మించి డబ్బు సంపాదించడం రమణయ్యకు నచ్చడం లేదు. వాడు కొంత తీరిక సమయాన్నుంచుకుని పురాణ గ్రంథాలు చదవాలని ఆశపడుతున్నాడు. కానీ భార్య వాడిని క్షణం కూడా తీరుబడిగా ఉండనివ్వదు. ఆమెతో దెబ్బలాడి తన ఇష్టం వచ్చినట్లుండాలంటే వాడికి మనశ్శాంతి ఉండడం లేదు.

అలాంటి సమయంలో ఆ ఊరికి పేరెన్నికగన్న సాధువొకడు వచ్చాడు. రమణయ్య ఆయన్ను కలుసుకుని, "ఎల్లకాలం ధన సంపాదన మీదే దృష్టి ఉంచితే నాకు మనశ్శాంతి ఉండదు. ధన సంపాదనను నిర్లక్ష్యం చేస్తే నా భార్య నాకు మనశ్శాంతి ఉండనివ్వదు. ఇలాంటి పరిస్థితుల్లో మనశ్శాంతిని ప్రసాదించే ఉపాయం నాకు చెప్పండి స్వామీ!" అని వేడుకున్నాడు.

సాధువు చిరునవ్వునవ్వి, "డబ్బు సంపాదించే విద్య అందరికీ అలవడదు. నీ విద్యను నువ్వు సార్థకం చేసుకో. బాగా డబ్బు సంపాదించు. ఆ డబ్బుతో లేనివారికి సాయపడు. పుణ్య కార్యాలు





చేయి. నీ సంపాదన సార్థకమవుతుంది. నీకు మనశ్శాంతీ కలుగుతుంది" అన్నాడు.

ఈ ఉపాయం రమణయ్యకు నచ్చింది. వెంటనే అమలు చేయాలనుకున్నాడు. కానీ ఆశ్చర్యంగా వాడికి చాలా సందేహాలు కలిగాయి. పుణ్యకార్యం చేయడం చాలా కష్టంగా తోచింది.

రమణయ్యను వ్యాపారి చేరదీశాడు. అది పుణ్యకార్యమే. కానీ ఆయన పుణ్యంకోసం ఆ పని చేయలేదు. తన వ్యాపారాన్నీ లాభాన్నీ పెంచుకుందు ఆ పని చేశాడు. రమణయ్యకు జీతం బత్తెం లేని నౌకరుగా ఉపయోగించుకుని చివరకు తనమాట వినలేదని గెంటేశాడు. అలాగే సీత కూడా రమణయ్యను డబ్బు సంపా దించే యంత్రంలా గుర్తించి పెళ్ళిచేసుకుంది.

ఈ ప్రపంచంలో మనుషుల్లో స్వార్థపరులే ఎక్కువ. అంతవరకూ రమణయ్య తన జీవితాన్ని ఇద్దరు స్వార్థపరులకోసం ధారపోశాడు. ఇక మీదట అలా జరక్కూడదు. మంచి వారికే సాయపడాలి.

రమణయ్య ఇలాగనుకున్నాడు కానీ తన వద్దకు వచ్చే ప్రతి వాడూ అబద్ధాలకోరుగానూ, మోసగాడు గానూ కనిపించడంతో చాలా ఇబ్బందిపడ్డాడు. రెండు రోజుల తర్వాత వాడు మళ్ళీ సాధువు వద్దకు వెళ్ళి, "నేను ఇకమీదట మంచివాళ్ళకే సాయపడాలనుకుంటున్నాను. నిస్వార్థపరులకే ఉపకారం చేయాలనుకుంటున్నాను. నా భార్య విషయంలో నాకెలాగూ తప్పదు. బయటివారి విషయంలోనైనా నా కోరిక తీరే ఉపాయం చెప్పండి" అనడిగాడు.

సాధువు కాసేపాలోచించి, "నీవు పుణ్యాపురం వెళ్ళు. నెలరోజులుండు. మొట్టమొదట నిన్నెవ రడుగుతారో వాళ్ళింట్లో మకాం పెట్టు. మొదటి వారం రోజులూ పాలుమాత్రం పుచ్చుకో. తర్వాత వారం పళ్ళుమాత్రం పుచ్చుకో. మూడో వారం జొన్నరొట్టెలు మాత్రం తినాలి. నాలుగో వారం మామూలు భోజనం చేసి తిరిగిరా. అక్కడున్నంత కాలం చెప్పింది వినడమే తప్ప ఎవరితోనూ వాదనకు దిగకు. పుణ్యాపురం ప్రజలు మహా పుణ్యాత్ములు. వారితో ఉండడం వల్ల నీకు మనశ్శాంతి లభిస్తుంది. అక్కడ నీకేమైనా సందేహా లుంటే తిరిగి వచ్చే రోజున గ్రామాధికారినడిగి తీర్చుకో" అని చెప్పాడు.

వెంటనే రమణయ్య కొంత డబ్బు తీసుకుని పుణ్యపురానికి ప్రయాణమయ్యాడు. అక్కడికి చేరుకుందుకు వాడికి రెండు రోజులు పట్టింది.

పుణ్యపురం అన్ని గ్రామాలకులా లేదు. పాడి పంటలతో, పచ్చని చెట్లతో ఆ ఊరు కలకలలాడుతోంది. ఆ ఊళ్ళో పెంకుటిళ్ళే ఉన్నాయి. అటు మేడలూ లేవు, ఇటు గుడిసెలూ లేవు. చక్కని విశాలమైన బాటలతో ఆ ఊరు సమర్థుడైన శిల్పి తీర్చిదిద్దినట్లుంది. గ్రామస్థులందరూ సంతోషానికి మారుపేరులా ఉన్నారు.

గ్రామంలో అడుగు పెట్టగానే వరదయ్య అనేవాడు రమణయ్యను కలుసుకుని, "నీకు ఇల్లు కావాలా? మా ఇంటికి రా" అని తీసుకుని పోయాడు. అక్కడ తన ఇంట్లో చిన్నగది చూపించి," ఇది నీ గది. నెలకు నూరువరహాలు అద్దె" అన్నాడు.

తన ఊళ్ళో ఆ గదికి అయిదు వరహాలకు మించి అద్దె ఇవ్వరు. ఆ మాట చెబుదామనుకున్న రమణయ్యకు సాధువు హెచ్చరిక గుర్తుకు వచ్చింది. ఎవరేమన్నా ఎదురు చెప్పకూడదు మరి! కానీ ఆ తర్వాత రమణయ్యకు తెలిసింది. ఆ ఊళ్ళోనూ మిగతా ఇళ్ళ అద్దెలు తన ఊరంత చవగ్గా ఉన్నాయి. ఎటొచ్చీ తనే వరదయ్యా పాలబడ్డాడు. ఈ విషయం తెలిసినా ఊళ్ళో ఒక్కరు కూడా అయ్యో పాపం అని రమణయ్య మీద జాలి పడలేదు.

మొదటి వారం రమణయ్య పాలు తాగి బ్రతకాల్సి ఉంది. అందుకని ఆయన పాలవాడి వద్దకు వెడితే పాలు - శేరు రెండు వరహాలన్నాడు. రెండు వరహాలిస్తే తన ఊళ్ళో నెలంతా రోజుకు





శేరు చొప్పున పాలుపోస్తారు.

"ఈ ఊళ్ళో ధరలు ఎక్కువగా ఉన్నాయే?" అన్నాడు రమణయ్య ఉక్రోషాన్ని అణచి పెట్టుకునే ప్రయత్నంచేస్తూ.

"ఒక్క పాల ధరే ఎక్కువ. పళ్ళో జొన్న రొట్టెలో, భోజనమో అయితే ఒకదానికిమించి ఒకటి తక్కువ" అన్నాడు పాలవాడు.

తర్వాతి వారాలకు ఖర్చు తక్కువౌతుందిలే అని రమణయ్య సరిపెట్టుకున్నాడు. కానీ వాడు పళ్ళు తినే సమయానికి వాటి ధర బాగా పెరిగి పోయి పాలధర పడిపోయింది. ఆ తర్వాత జొన్న రొట్టెలు, భోజనం విషయాల్లోనూ అలాగే జరిగింది. తన గ్రామం నూరు వరహాలు కూడా కాని దానికి నెల్లాళ్ళలో రమణయ్య ఆ గ్రామంలో పదిహేనువందల వరహాలు ఖర్చు పెట్టాడు.

డబ్బు ఖర్చయినందుకు రమణయ్యకు బాధగాలేదు. కానీ పుణ్యపురం నిండా మోసగాళ్ళు, అబద్ధాల కోరులు ఎక్కువగా ఉన్నట్లు వాడికి తోచింది. తన డబ్బు అలాంటి వారి పాలబడిందేనన్న బాధతో అక్కడున్న నెలరోజులూ వాడికి మనశ్శాంతి కరువయింది. తిరుగు ప్రయాణమయ్యే రోజున వాడు గ్రామాధికారిని కలుసుకున్నాడు.

"మా ఊరు మీకు తప్పక నచ్చి ఉండాలి. మళ్ళీ వస్తూండగలరని కోరుకుంటాను" అన్నాడు. గ్రామాధికారి వినయంగా రమణయ్యతో.

"ఒకసారి వచ్చిన వాడు మళ్ళీ ఊరురాడు. ఇక్కడ అంతా మోసం, అబద్ధం" అంటూ రమణయ్య ఆయనకు తన అనుభవాలు చెప్పారు.

"తమరు పొరబడ్డారు. పుణ్యకార్యాలు చేయాలనుకున్న పుణ్యాత్ములంతా వచ్చి చేరి కలిసి కట్టుకున్న ఊరిది. ఇక్కడ మోసం, అబద్ధం ఏమీ ఉండవు. మీ దగ్గర అదనంగా తీసుకున్న డబ్బును ప్రతి ఒక్కరూ గ్రామాధికారినైన నాకు సమర్పించుకుని వెళ్ళారు. ఆ డబ్బును మా గ్రామస్థులందరం కలిసి సక్రమంగా పుణ్య కార్యాలకు వినియోగిస్తాం" అన్నాడు గ్రామాధికారి.

"పుణ్యకార్యాలంటే ఏం చేస్తారు?" అన్నాడు రమణయ్య.

"దేశమంతటా ఉచిత వైద్యశాలలు నిర్మిస్తున్నాం. ఉచిత పాఠశాలలు నెలకొల్పుతున్నాం. బాటసారులకు ఉచిత భోజన సదుపాయాలు కల్పిస్తున్నాం. అనాధులకు శరణాలయాలు ఏర్పాటు చేస్తున్నాం -

ఇలా ఇంకా ఎన్నో చేస్తున్నాం" అన్నాడు గ్రామాధికారి.

రమణయ్య ఆశ్చర్యపడి, "మీరు చేసే పనులు బాగానే ఉన్నాయి - కానీ ఇందుకు మోసం చేసే డబ్బు సంపాదించాలా? సామాన్యులను దోచాలా? చందాలు వసూలు చేస్తే ఎంతో గౌరవంగా ఉంటుంది కదా!" అన్నాడు.

"మేము సామాన్యులను దోచడం లేదు. ఎవరినీ మోసం చేయడం లేదు. మేము చేసే మంచి పనుల గురించి అందరికీ తెలుసు. తమకు తాముగా మంచిపని చేయడంకంటే మా ద్వారా చేయడంలోనే పుణ్య ఫలితం ఎక్కువుంటుందని చాలా మంది మా ఊరు వస్తున్నారు. మా ఊరి గురించి సాధువులు, మహాత్ములు ప్రచారం చేసి మీ వంటి వారినిక్కడకు పంపిస్తున్నారు. మేము చేసే పుణ్య కార్యాల ఫలితం మీ వంటి వారిదే! మీ వంటి వారికి సదుపాయాలు చేకూర్చడానికీ, మనశ్శాంతిని కలగించడానికీ పుణ్యపురం గ్రామస్థులు తమ జీవితాలను అంకితం చేశారు. ప్రతి గ్రామస్థుడూ తన అవసరానికి మించిన సంపాదనను గ్రామాధికారి పరం చేస్తాడు. దీన్ని బట్టే మా గ్రామస్థుల గొప్పతనం తెలుసుకోవచ్చు. మా గ్రామంలో తమకు తాముగా వచ్చి ఉండే వారే తప్ప బలవంతంగా మేమెవరినీ ఉంచడం లేదు. గ్రామం నచ్చని వారు వచ్చిన రోజునే వెనక్కు వెళ్ళిపోవచ్చు. నచ్చిన వారు ఎన్ని మాసాలైనా ఉండొచ్చు. అది వారి అభీష్టమే తప్ప మా బలవంతంకాదు -" అన్నాడు. గ్రామాధికారి.

ఈ మాటలు వినగానే ఒక్కసారిగా రమణయ్య మనసు తేలిక పడింది. వాడు తిరిగి తనింటికి వెళ్ళాక పుణ్యపురం గురించి గొప్పగా ప్రచారం చేశాడు. అంతే కాకుండా అప్పట్నించీ ప్రతి ఏటా పుణ్యపురంలో భార్యాబిడ్డలతో సహా నెల రోజులుండి వస్తూండడం ఆనవాయితీ చేసుకున్నాడు.

ఆ విధంగా రమణయ్యకు శాశ్వతమైన మనశ్శాంతి లభించింది.



# పరీక్ష

ధర్మవరం అనే ఊళ్ళో ధర్మారావు అనే ధనవంతుడు ఉండేవాడు. ఆయన గొప్ప దాత. ఎన్నో దానాలు చేశాడు. దేవాలయాలు కట్టించాడు. చెరువులు తవ్వించాడు. వైద్యశాలలు, పాఠశాలలు నిర్మించాడు. ఈ సంస్థలన్నిటిని నిర్వహించడానికి ఎందరినో ఉద్యోగులను నియమించాడు. ఆ జమా ఖర్చులు ఆయనే చూసుకుంటూ ఉండేవాడు.

కొన్నాళ్ళకు ధర్మారావు వృద్ధుడయ్యాడు. దానికి తోడు ఆయన భార్య జబ్బుపడి మరణించింది. తనకు సంతానం లేదు. దాంతో ధర్మారావు బాగా నీరసించి పోయాడు. జమా ఖర్చులు చూసుకోవడం తన వల్ల కావడం లేదు. అందుచేత తన సంస్థలన్నిటిని చూసుకోవడానికి ఒక ధర్మకర్తను నియమించాలనుకున్నాడు. అందుకు ఒక పరీక్ష పెట్టాలని నిశ్చయించుకున్నాడు.

అనుకున్నదే తడవుగా తనకు ధర్మకర్త కావాలనీ, మంచి జీతం ఉంటుందనీ, ఫలానా రోజున తన గ్రామంలోని దేవాలయంలో తనను కలుసుకోవాలనీ చాటింపు వేయించాడాయన.

ఆ రోజున ధర్మారావు మారు వేషంలో దేవాలయం ముందున్న ఒక అరుగు మీద కూర్చొని ఉన్నాడు. అదే సమయంలో అభ్యర్థులు దేవాలయంలోనికి రాసాగారు. వాళ్ళు లోనికి వస్తూ దేవాలయం ముందున్న ఎదురు రాతిని తట్టుకొని పడబోయి వెనక్కి తిరిగి రాతిని చూసి అప్పుడు లోనికి వెళ్ళారు. మారు వేషంలో ఉన్న ధర్మారావు అందరినీ గమనించాడు.

చివరకు ఒక పెద్ద మనిషి దేవాలయం లోనికి వెళ్తూ ముందున్న రాతిని చూశాడు. అది అలా ఉండడం ప్రమాదకరంగా భావించి, వెంటనే పక్కనే ఉన్న మరో పెద్ద రాతితో ఆ ఎదురురాతిని తవ్వి తీసి పారేసి నేల చదును చేసి లోనికి వెళ్ళాడు. ధర్మారావు ఆ పెద్దమనిషిని ధర్మకర్తగా నియమించాడు.

— దిట్ట కవి శ్రీనివాసాచార్య





# స్వర్ణద్వీప యాత్ర

## 3

[సంజయుడు రాజద్రోహం చేయాలనుకుంటే కోశాధిపతి, ప్రజాప్రతినిధి అతనికి సహకరించలేదు. అందుకని శివమందిరంలో కోరికలు ఫలించే శివార్చన వేళకు మెలకువ రాకుండా తన భార్యకు, రాజుకు, రాణికి మత్తుమందు కలిపిన పాయసమిచ్చాడు. తనొక్కడూ అర్చన వేళకు వెళ్ళి రాజుకు పుత్ర సంతానం కలక్కూడదని కోరుకున్నాడు. ఆ తర్వాత....]

ఆ రోజు మహారాజు ధనంజయుడు, మహారాణి సావిత్రి నిద్ర లేచేసరికి బారెడు పొద్దెక్కింది. మెలకువ వచ్చినా మత్తు విడడానికి వారిద్దరికీ కాసేపు పట్టింది. అప్పుడిద్దరికీ అసలు విషయం గుర్తుకొచ్చింది. సూర్యోదయ సమయం దాటిపోయినందుకు ఇద్దరూ ఎంతో బాధపడ్డారు.

కాసేపటికి మహామంత్రి సంజయుడు సకుటుంబంగా వారిని చూడవచ్చాడు. రాజు జరిగింది మంత్రికి చెప్పాడు.

"అయ్యో! మా ఇంట్లోనూ అలాగే జరిగింది. సుమతి ఇప్పుడిప్పుడే నిద్ర లేచింది. వెంటనే మీ వద్దకు బయల్దేరి వచ్చాం. మనలో కోరికలు తీరే సమయంలో పరమశివుడి దర్శనం చేసుకున్నది నేనొక్కడినే!" అన్నాడు సంజయుడు.

"నీవు ఏం కోరుకున్నావు?" అనడిగాడు ధనంజయుడు.

"ప్రభూ! నా మనసులో ఉన్న దొక్కటే కోరిక. అందుకే నిన్నంతా ఉపవాసమున్నాను. ఉదయం శివమందిరానికి వెళ్ళాను. తమకు పుత్రప్రాప్తి కావాలన్న కోరిక ఒక్కటే నాలో ఉంది. కానీ ఆ సమయంలో నేను శివుని సన్నిధిలో ఎన్నడూ ఎరుగని పరవశం చెందాను. అప్పుడు నేను సర్వం మర్చిపోయాను. అక్కడ కాసేపుండి భగవంతుణ్ణి స్తోత్రం చేసి ఇల్లు చేరాను. అప్పటికి

కైవల్యా



గానీ నాకు స్ఫురించలేదు — ఆ అమూల్య సమయంలో భగవంతుణ్ణి నేనేమీ కోరలేదని!" అన్నాడు సంజయుడు.

సావిత్రి నొచ్చుకుని, "అయ్యో! ఆ సమయంలో భగవంతుని దర్శనం చేసుకునే అదృష్టం తమకు కలిగింది. మీ కోసమైనా ఏదైనా కోరుకోవలసింది" అంది.

"లేదు మహారాణీ! నాలో నా కోసం కోరికలు లేవు. ఇప్పటికున్న కోరిక ఒక్కటే — సమయానికది స్ఫురించలేదు" అన్నాడు సంజయుడు బాధగా.

"మంత్రీ! మాకు పుత్రయోగం లేదు. ఉంటే మాకే మెలకువొచ్చి ఉండేది. అంతా ఆ దేవుడి అభీష్టం. శివునాజ్ఞలేనిదే చీమైనా కుట్టదు గదా!" అన్నాడు ధనంజయుడు నిట్టూర్పుతూ.

"అలాగనకండి ప్రభూ! తమకు పుత్రయోగ ముందనే నా నమ్మకం. ఆ సమయంలో నాకు పరమశివుడి దర్శనం కావడం మన అదృష్టం. లీలామానుష విగ్రహుడు. ఆయనకు మన మనసులోని మాట చెప్పాలా? అన్నీ తెలుసుకుని ఆయన నా కోరిక తీర్చగలడు. చూస్తూండండి. అంతా నేను చెప్పినట్లే జరుగుతుంది" అన్నాడు సంజయుడు.

అంతలో కాపలా భటుడొకరు అలా వచ్చి బైరాగి ఒకడు రాజదర్శనం కోరుతున్నట్లు చెప్పాడు. రాజాజ్ఞ కాగానే బైరాగి అక్కడకు వచ్చాడు.

బైరాగి కాషాయవస్త్రాలు ధరించాడు. గుబురుగా పెరిగిన గేడ్డం మీసాలవెనుక కూడా ఆయన ముఖం తేజస్సుతో వెలిగిపోతోంది. ఆయన భుజానికి కాషాయపు జోలె వ్రేలాడుతోంది.

అక్కడున్న వారందరూ అప్రయత్నంగా బైరాగికి నమస్కరించారు.

బైరాగి చేతులెత్తి అందర్నీ దీవించి ధనంజయుడితో, "రాజా! నీవు సత్పురుషుడివి. నీ రాణి పతివ్రత. మీ దంపతులకు సంతానం లేనందుకు దేశంలోని ప్రజలందరూ దిగులు చెంది ఉన్నారు. అందుకే ఈరోజున సూర్యోదయ కాలంలో నీ దేశ ప్రజలలో ఒక్కరు కూడా తమ కోసం ఏమీ కోరుకోలేదు. అందరూ మీకు పుత్ర ప్రాప్తి కావాలని కోరుకున్నారు. ఇంతగా ప్రజల అభిమానాన్ని చూరగొన్న నీవు ధన్యుడివి" అన్నాడు.

ఇది వింటూనే మంత్రి తడబడ్డాడు. సుమతి, రాజదంపతుల ముఖాలు సంతోషంతో వెలిగి

పోయాయి. ధనంజయుడు బైరాగిని వచ్చిన పని అడిగాడు.

"నా వద్ద ఒక అద్భుత ఫలమున్నది. అది భుజించిన స్త్రీకి దివ్యాంశ గల కొడుకు పుడతాడు. పరమయోగ్యుడి భార్యకే ఫలాన్నివ్వాలనుకుంటున్నాను. ఎంతోకాలంగా ప్రపంచ సంచారం చేస్తున్నాను. ఇన్నాళ్ళకు నీవు దొరికావు" అంటూ 'తన జోలిలోంచి మిలమిల మెరిసే పండునొకదాన్ని తీసి రాజుకందించాడు బైరాగి.

రాజు అద్భుత ఫలాన్ని భార్యకిచ్చాడు. సావిత్రి ఆ ఫలాన్ని వెంటనే భుజించి బైరాగికి నమస్కరించింది. బైరాగి, "శీఘ్రమేవ సుపుత్ర ప్రాప్తిరస్తు" అని ఆమెను దీవించి అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

అప్పుడు ధనంజయుడు సంజయుణ్ణి కౌగలించుకుని, "మంత్రీ! నీది నిజంగా అమృతవాక్కు. నీ హృదయం ప్రేమమయం. మా కోరిక తప్పక తీరుతుందని నువ్వన్నావు వెంటనే బైరాగి వచ్చి అద్భుత ఫలాన్నిచ్చి వెళ్ళాడు" అని మెచ్చుకున్నాడు.

"నాది నిజంగా అమృతవాక్కే అయితే - ఇప్పుడు జరిగిందానికి నన్ను నేనే క్షమించుకోలేను. ఎంతో కష్టపడి పథకం వేసి పాయసంలో మత్తు మందు కలిపితే అదంతా వృథా అయింది" అని మనసులో బాధపడుతూ పైకి సంతోషం నటించాడు సంజయుడు.

అలా రోజులు గడిచాయి. కొంతకాలానికి రాణి సావిత్రి పండంటి మగబిడ్డను కన్నది. రాజదంపతులా బాలుడికి విజయుడని పేరు పెట్టారు. విజయుడు పుట్టినందుకు చంపక దేశమంతటా వేడుకలు



జరుపుకున్నారు ప్రజలు.

విజయుడంటే మంత్రి కుమారుడు వినయుడికి గొప్ప అనుబంధమేర్పడింది. వాడు రోజూ అంతఃపురానికి వెళ్ళి విజయుడితో ఆడుకునేవాడు. ప్రతిరోజూ ఇంటికి తిరిగివచ్చి విజయుడి చేష్టలు చెప్పి ముచ్చటపడుతూండేవాడు.

ఆ కబుర్లు వింటున్నపుడల్లా సంజయుడికి మనసులో భగ్గుమనేది. కొడుక్కి విజయుడి మీద విషం నూరిపోయాలనుకున్నాడు. కానీ వినయుడు రహస్యం దాచలేడు. అందుకని ఆయన ఏం చేయాలా అని పలువిధాల ఆలోచించసాగాడు.

వినయుడు రాజు కావాలని సంజయుడి ఆశ. అందుకు విజయుడు అడ్డు. విజయుణ్ణి మట్టు పెట్టాలంటే అందుకు భార్యగానీ, కొడుకుగానీ



సహకరించరు. పైగా వాళ్ళు విజయుణ్ణి స్వంత మనిషిలా అనుభవిస్తున్నారు.

విజయుణ్ణి చంపడం కోసం సంజయుడు భాగవత పారాయణం ప్రారంభించాడు. భాగవతంలో శ్రీకృష్ణుడు శిశువై ఉండగా కంసుడెన్నో హత్యా ప్రయత్నాలు చేశాడు. అవన్నీ శ్రద్ధగా చదివి తెలుసుకున్నాడు సంజయుడు.

కంసుడి ఉపాయాలు అమలు చేయడంలో సంజయుడికో పెద్ద ఇబ్బంది అగుపించింది. కంసుడు మహారాజు. ఆయనకెందరో అనుచరులున్నారు. కృష్ణున్ని చంపడానికి ఆయన వారిని వినియోగించాడు. ఇక్కడ విజయుడు మహారాజు బిడ్డ. తనకు అనుచరులు లేరు. తను తప్ప మిగిలిన వారందరూ రాజభక్తులు. ఏం చేసినా తను ఒంటరిగా చేయాలి. ఇతరుల చేత చేయించినా అది పురమాయించడంవల్ల అవదు. ప్రమాదవశాత్తూ జరిగినట్లుండాలి.

ఇలా ఆలోచించి సంజయుడు విజయుణ్ణి చంపడానికి వినయుణ్ణే ఉపయోగించాలనుకున్నాడు.

ఒకరోజు రాజాంతఃపురంలో వినయుడు విజయుణ్ణి ఆడిస్తున్నాడు. అప్పుడు వినయుడి వయసు ఏడాది దాటిందంతే!

వినయుడు బంతిని విసిరితే అది పైన వ్రేలాడుతున్న గాజు దీపానికి తగిలింది. అది పగిలి అద్దం ముక్కలు కిందపడ్డాయి. ఆ సమయంలో అక్కడకు సంజయుడు వెళ్ళాడు. పరిస్థితి చూసి కంగారు నటిస్తూ, "వినయా! విజయుడు పగిలిన అద్దం ముక్కలు పట్టుకుంటే ప్రమాదం. అతడిని ఎత్తుకో!" అన్నాడు.

వినయుడు వెంటనే విజయుడి నెత్తుకున్నాడు.

అప్పుడక్కడింకెవ్వరూ లేరు. మంత్రి పగిలిన అద్దం ముక్కలను ఏరుతున్నట్లు కూర్చుని వాటి సూదిభాగాలు పైకి వచ్చేలా నిలబెట్టేడు. మొత్తం నాలుగు అద్దం ముక్కలలా నిలబెట్టేక, "వినయా! యువరాజునిలా తీసుకుని రా!" అన్నాడు.

వినయుడు విజయుడి నెత్తుకుని అద్దం ముక్కలదాకా వచ్చాడు. మంత్రి వినయుణ్ణే చూస్తూ, "అరే! నీ పాదాల దగ్గర పాములా ఉందే!" అన్నాడు.

అంతే — వినయుడు విజయుణ్ణి అప్రయత్నంగా విడిచిపెట్టాడు.

అప్పుడే అక్కడ అడుగుపెట్టిన మహారాణి

కెవ్వుమని అరిచింది. అప్రయత్నంగా సంజయుడు చెవులు మూసుకున్నాడు.

కొందరు రాజభటులు పరుగున వచ్చారు.

విజయుడు అప్పటికి క్రిందపడ్డాడు. రాజభటు డొకడు వాడిని చటుక్కున పైకి ఎత్తాడు. అప్పుడు క్రిందనున్న గాజు పెంకొకటి గీరుకుని, "అబ్బా!" అని బాధగా మూలిగాడు.

అప్పటికి రాణి కూడా అక్కడకు వచ్చి, "అరే! ఇక్కడ అన్నీ గాజు పెంకులు. నా బాబు కేమయిందో?" అంటూ ఆదరాబాదరాగా విజయుడి నెత్తుకుంది. ఆశ్చర్యంగా విజయుడి వంటి మీద ఎక్కడా చిన్న గాయం కూడా లేదు.

సంజయుడాశ్చర్యపడి నేల మీద చూస్తే తను నిలబెట్టిన గాజు పెంకులు నుగ్గునుగ్గయి ఉన్నాయి.

"అదృష్టవంతుడు. సూది మొన మీద పడలేదు. బాలుడు పడే సమయానికవి బల్లపరుపుగా పడి ఉంటాయి" అనుకున్నాడు సంజయుడు.

మహారాణి వినయుణ్ణి గద్దించి చూస్తూ, "ఏం జరిగింది?" అంది.

వినయుడు లెంపలు వేసుకుని, "నావి వదులు చేతులు. ఇంకెన్నడూ యువరాజునెత్తుకోను. దూరం నుంచే ఆడిస్తాను. నన్ను మాత్రం ఇక్కడకు రానివ్వండి" అన్నాడు సావిత్రితో. సావిత్రి వాడిని ఆప్యాయంగా దగ్గరగా తీసుకుని తల నిమిరింది.

వేలు తెగిన భటుడు, "యువరాజు నెత్తుకో బోయిన నాకు గాయమైంది. గాజు పెంకుల మీదే పడినా యువరాజుకు చిన్నగాయం కూడా కాలేదు. ఆశ్చర్యంగా ఉంది" అన్నాడు.



"కారణజన్ముడు. వాడికెవరేమన్యాయం తల పెట్టినా ఫలించదు" అన్నాడు సంజయుడు.

"అవును. అలాగే జరుగుతుంది. మీది అమృత వాక్కు" అంది సావిత్రి.

అప్పుడు సంజయుడు మనసులో తన్ను తానే తిట్టుకుని, "నాది అమృతవాక్కని తెలిసుండీ నా శత్రువుని నేనెందుకు దీవిస్తున్నానో తెలియదు. ఇక మీదట యువరాజు గురించి ఒక్క మంచిమాట కూడా అనకూడదు" అనుకున్నాడు. అయితే యువరాజుకు ప్రమాదం జరగనందుకాయన కాశ్చర్యం మాత్రం అలాగే ఉంది.

ఆ తర్వాత యువరాజుపై హత్యా ప్రయత్నం చేయాలంటే ఆయన భయపడ్డాడు. అలా కొన్నేళ్ళు గడిచాయి. ఒకరోజున...

అప్పుడు విజయుడికి అయిదేళ్ళు.

బంగారు గిన్నెలో బువ్వ తింటున్నాడు విజయుడు. మూడేళ్ళ వయసునుండీ వాడు అంతే! తన పని తనే చేసుకుంటాడు. తల్లికి గోరుముద్దలు తినిపించాలన్న కోరిక మూడేళ్ళ వయసుదాకానే చెల్లింది.

భోజనం పూర్తయ్యాక వాడు పిల్లలతో కలిసి ఆడుకుందుకు వేరే స్థలానికి వెళ్ళాడు. అంతలో ఒక పిల్లి చల్లగా అటు వచ్చింది. ప్రతిరోజూ విజయుడు విడిచిపెట్టింది తినడం దాని అలవాటు.

పిల్లి బంగారు గిన్నెలో మూతి పెట్టింది. ఉత్సాహంగా గిన్నెను నాకింది. అంతే - కొద్ది క్షణాల్లో గిలగిల కొట్టుకుని మరణించింది.

ఆ దృశ్యం చూసిన దాసీలు కంగారుపడి వెళ్ళి రాణికి చెప్పారు. వెంటనే రాజవైద్యుడికి కబురు వెళ్ళింది. యువరాజు భోజనంలో విషం కలిసినట్లు నిర్ధారించబడింది.

ప్రతిరోజూ యువరాజు భోజనానికి అన్ని పరీక్షలూ జరిగేకనే - వాడిదాకా వస్తుంది. విచారించగా అన్ని పరీక్షలూ సక్రమంగా జరిగినట్లు తెలిసింది. యువరాజుకు ముందు ఆ భోజనం రుచి చూసిన వాడు పిడుగులా ఉన్నాడు.

ఆహారంలో విషమెలా కలిసిందన్న విచారణ ఒక మూల కొనసాగుతూండగా మహారాణి మనసు యువరాజు కోసం ఆక్రోశించిది. తను మహారాణిననీ, తనకు దాసజనమున్నారనీ మరిచి ఆమె క్రీడా మందిరానికి పరుగుతీసింది.

సావిత్రి క్రీడా మందిరం చేరుకునేసరికి అక్కడ కలకలం ఎక్కువగా ఉంది. ఎందరో బాలరు గుంపుగా గుమిగూడి ఉన్నారు. సావిత్రి వారిని సమీపించి గుంపును చీల్చుకుని వెళ్ళింది. మధ్యలో వెల్లకిలా పడి ఉన్నాడు విజయుడు. ఎవరెంత కుదిపినా కదలడం లేదు, మెదలడం లేదు.

"విజయా!" అంటూ అరిచి కుప్పలా కూలి పోయింది సావిత్రి.

— (ఇంకావుంది)





# కొద్దిగా ఆలస్యం

సిద్ధయ్య ఏ పని చెప్పినా ఆలస్యంగా చేస్తాడని అంతా తిట్టేవారు. వాడి తాతకు జబ్బు చేసి మందుకోసం పొరుగూరు పంపితే ఎక్కడెక్కడ తిరిగాడో ఏమో సరిగ్గా తాతయ్య మాసికం రోజుకి తిరిగి వచ్చాడు.

"మందుకి పంపితే మాసికానికి తిరిగొస్తాడు" అని తండ్రి వాడి మీద తెగ విసుక్కున్నాడు.

తను తాతయ్యకు మందు ఆలస్యంగా తేవడం వల్లనే ఆయన చనిపోయాడని అర్థం చేసుకుందుకు సిద్ధయ్యకు రెండురోజులు పట్టింది. అప్పుడు వాడు వెక్కివెక్కి ఏడ్చాడు.

"ఇప్పుడేడ్చి ఏం లాభం? నిండు ప్రాణాన్ని పొట్టన పెట్టుకున్నావు-" అంటూ ఇంటిల్లపాదీ వాణ్ణి అదేపనిగా తిట్టారు.

సిద్ధయ్యకు జీవితమంటే విరక్తి పుట్టి ఆత్మహత్య చేసుకోవాలనుకున్నాడు. ఆ ఉద్దేశ్యంతో ఊరు విడిచి అడవిదారి పడితే అక్కడో సాధువు ఎదురై వాడి కథ తెలుసుకుని, "నాయనా! నువ్వే తప్పూ చేయలేదు. నిజంగా నువ్వు ఆలస్యంగా పనిచేసే వాడివైతే నీ తాతయ్య మందుకు నిన్ను పంపడం నీ తలిదండ్రుల తప్పు. వాళ్ళు చేసిన తప్పుకు నిన్ను తిట్టారు. అయినా నీ తాతయ్యకు కాలం మూడింది. ఆయన పోయాడు. నీవు తొందరలోనే లక్షాధికారివయ్యే యోగమున్నది. నా మాటవిని రాజధానికి వెళ్ళు" అన్నాడు.

ఈ మాటలు సిద్ధయ్యకు నచ్చాయి. ఇంత వరకూ ఈ మాత్రం ఆప్యాయంగా వాడితో మాట్లాడిన వారు లేరు. వాడు సాధువుకు నమస్కరించి రాజధానికి దారి అడిగి తెలుసుకుని అటుగా వెళ్ళాడు.

కొద్దిరోజులకే సిద్ధయ్య రాజధాని చేరుకున్నాడు. అప్పుడక్కడ ఒక విచిత్రమైన పోటీ జరుగుతోంది.

అవంతీ దేశపు రాజు చంద్రసేనుడు హాస్య ప్రియుడు. ఆయన కొలువులో అతి చమత్కారి అయిన విదూషకుడున్నాడు. వాడి పేరు హాస్యగిరి. హాస్యగిరి నోరువిప్పి పలికాడంటే పొట్టచెక్క

పావురాల రాముడు

లయ్యేలా నవ్వితీరాల్సిందే!

చంద్రసేనుడు హాస్యగిరి ప్రతాపం ప్రపంచమంతా చాటి చెప్పాలనుకున్నాడు. ఆయన వాణ్ణి అన్ని దేశాల రాజధానీ నగరాలకూ పంపిస్తున్నాడు. ఎవరైనా వాడి మాటలు విని నవ్వకుండా ఉండగలిగితే లక్ష వరహాలు బహుమతిని ప్రకటించాడు. ఇంతవరకూ హాస్యగిరి నాలుగు దేశాలు చుట్టి ఇప్పుడు సిద్ధయ్య ఉన్న దేశానికి వచ్చాడు. ఇంతవరకూ ఒక్కరూ నవ్వాపుకుని బహుమతిని సంపాదించుకోలేకపోయారు.

ఇక్కడా అంతే జరిగింది. ఎందరో హాస్యగిరి ఎదుటకు వచ్చి వాడు చెప్పే మాట వినగానే ఘొల్లున నవ్వి వెళ్ళిపోతున్నారు. అలాంటి పరిస్థితిలో సిద్ధయ్య ఇదంతా చూసి "ఇక్కడేం జరుగుతోందీ?" అనడిగాడు.

వాడు పోటీలో పాల్గొంటాడేమోనని ఎవరో ముందుకి తోశారు. సిద్ధయ్య హాస్యగిరి ముందు నిలబడ్డాడు. హాస్యగిరి ఛలోక్తులు ప్రారంభించాడు. సిద్ధయ్య నవ్వలేదు. ఒకటి కాదు, రెండు కాదు... వరుసగా నూరు ఛలోక్తులు వినిపించాడు హాస్యగిరి. చుట్టుపక్కల ఉన్న వాళ్ళందరూ ఘొల్లుమని పడిపోతున్నారు తప్ప. సిద్ధయ్య మాత్రం స్థిరంగా రాతిస్థంభంలా నిలబడ్డాడు. దాంతో వాడికి లక్ష వరహాల బహుమతి అందింది. అంత గొప్పపని చేసినందుకు రాజు వాడికి ప్రత్యేకమైన విడిది ఇచ్చాడు.

తన ఛలోక్తులకు నవ్వకుండా సిద్ధయ్య ఎలా ఉండగలిగేడో తెలుసుకోవాలని హాస్యగిరిలో కుతూహలం రేగి ఆ రాత్రి విడిదికి వెళ్ళాడు. ఆ సమయానికి సిద్ధయ్య కడుపు పట్టుకుని మంచం మీద పడుకుని తెగ నవ్వేస్తూ దొర్లి పోతున్నాడు. హాస్యగిరి వాడిచేత మాట్లాడించడానికి చాలాసేపు ఎదురు చూడాల్సి వచ్చింది.

సిద్ధయ్య స్థిమితపడ్డాక హాస్యగిరితో, "నీ ఛలోక్తులు అర్థం కావడం కొద్దిగా ఆలస్యమయింది. ఇప్పుడు వాటికే నవ్వుకుంటున్నాను" అన్నాడు.

ఇలా కూడా జరగొచ్చని తెలియని హాస్యగిరికి, పోటీలో తను నెగ్గాడో ఓడాడో అర్థం కాలేదు కానీ ఈ విశేషం అతడి ఛలోక్తులకు జతపడింది.





# అపస్వరం

కాంచనపురంలో ధనగుప్తుడిని మించిన లోభి లేడని ప్రతీతి. ఆయన వంశపారంపర్యంగా వస్తున్న వ్యాపారాన్ని సమర్థవంతంగా నిర్వహిస్తూ మితిమీరిన పొదుపుతో ఆస్తిని రెట్టింపు చేశాడు.

ధనగుప్తుడి కుమారుడు వనగుప్తుడు. అన్నింటా తండ్రి గుణాలు పుణికి పుచ్చుకున్నాడు. వ్యాపారంలో తండ్రికి చేదోడు వాదోడుగా ఉంటూండేవాడు. వాడు తీసే కూనిరాగాలు తండ్రి మనసుకు ఎంతో హాయనిపించేవి. అందుకని మరీమరీ అడిగి పాడించుకునేవాడు.

వనగుప్తుడికి సంగీతమంటే ఇష్టం. మున్ముందు బాధ్యతల బరువు పడితే వీలు పడదు కాబట్టి నేర్చుకుంటే ఇప్పుడే నేర్చుకోవాలి. ఈ విధంగా భావించి వాడు తండ్రికి తన కోరిక చెప్పుకున్నాడు.

ఆ ఊళ్ళో ప్రముఖ సంగీత విద్వాంసుడు శివశంకరుడుంటున్నాడు. ఆయన ఓ పట్టాన ఎవరినీ శిష్యుడిగా స్వీకరించడు. స్వీకరించిన వారిని గురుదక్షిణ దండిగా అడుగుతాడు.

గురుదక్షిణ ఇవ్వకుండా తన కొడుకును శివశంకరుడి శిష్యుడిని చేయాలని ధనగుప్తుడో ఉపాయమాలోచించాడు. ఆ ప్రకారమాయన వనగుప్తుణ్ణి వెంటబెట్టుకుని శివశంకరుడి వద్దకు వెళ్ళి, "అయ్యా! వీడు నా ఏకైక పుత్రుడు. వ్యాపారం మాకు వంశానుగతంగా వస్తోంది. కానీ వీడికి సంగీతం అభ్యసించాలని ఉంది. అతి కష్టం మీద ఓ ఏడాదిపాటు మాత్రం వీడిని సంగీతానికి విడిచిపెట్టగలను. ఆ వ్యవధిలో వీడికి సంగీతం నేర్పడం మీ వల్ల అవుతుందా?" అనడిగాడు.

శివశంకరుడు వనగుప్తుణ్ణి కొన్ని పాటలు పాడమన్నాడు. అవి విన్నాక, "వీడికి సహజంగా గాన కళ అబ్బింది. ఏడాదిలో వీణ్ణి ఉత్తమ సంగీతకారుడిగా తీర్చి దిద్దగలను. అయితే, అందుకుగానూ నాకు అయిదువేల వరహాలు గురుదక్షిణగా ఇవ్వగలవా?" అన్నాడు.

"తప్పకుండా ఇచ్చుకోగలను. కానీ నా కొడుకు తమ వద్ద నేర్చుకోలేకపోతేనో?" అన్నాడు ధనగుప్తుడు. "అప్పుడు నేను నీ నుంచి గడ్డిపోచ కూడా ఆశించను" అన్నాడు శివశంకరుడు.

వనగుప్తుడు శివశంకరుడి వద్ద చేరి కొద్ది మాసాలకే ఆయనకు ప్రియ శిష్యుడయ్యాడు. అలా సంవత్సరం గడిచేక శివశంకరుడు పెద్ద సభ చేసి నగరంలోని పెద్దలందరి ముందటా తన శిష్యుల చేత కచేరీ ఇప్పించాడు.

కచేరికి ముందు ధనగుప్తుడు కొడుకును కలుసుకుని, "నాయనా! నీవు బాగా పాడగలిగినప్పటికీ ఈ రోజుకు మాత్రం అపస్వరాలు పలికించు. నీకు సరైన శిక్షణ ఇవ్వలేదని శివశంకరుడికి గురుదక్షిణ నిరాకరిస్తాను" అన్నాడు.

వనగుప్తుడు సరేనన్నాడు. ఆ రోజు శివశంకరుడి శిష్యులందరూ అద్భుతంగా పాడితే వనగుప్తుడొక్కడే అపస్వరాలు పలికించాడు. శ్రోతలందరూ వాడిని అపహాస్యం చేశారు. శివశంకరుడి ముఖం చిన్నబోయింది.

ధనగుప్తుడు శివశంకరుడి వద్దకు వెళ్ళి, "గురువర్యా! నా కుమారుడపహాస్యం పాలైనాడన్న బాధకంటే తమరి ఏడాది శ్రమా బుగ్గిపాలైందనే నాకు బాధగా ఉంది. దురదృష్టమంటే ఇదేనేమో!" అన్నాడు.

శివశంకరుడు విచారంగా, "అవును నాయనా! దురదృష్టవంతుణ్ణి బాగుచేయగల వారెవ్వరూ లేరు. అచిరకాలంలోనూ నా శిష్యులలో ఉత్తముడయ్యాడు వనగుప్తుడు. ఈ ఏడాది నా శిష్యులలో ఉత్తముడైన వాడికి మహారాజు రెండు లక్షల వరహాల నగదు బహుమతినిచ్చి ఆస్థాన గాయకుడిగా నియమించాలనుకున్నాడు. ఈ అవకాశం వనగుప్తుడికే తప్పక వరిస్తుందని నేను నమ్మాను. దురదృష్టం వాడినోట అపస్వరాలు పలికించింది. ఇది వాడి సంగీత జీవితానికే అపస్వరమయింది" అంటూ నిట్టూర్చాడు.

అంతే! ధనగుప్తుడు కొయ్యబారిపోయాడు.






# శాశ్వతం

కిష్టప్పకు అతిశయం ఎక్కువ. కష్టాల్లో ఉన్న వారిని ఓదార్చడానికి బదులు మనసు కష్టపెట్టేలా మాట్లాడి ఇబ్బంది పెట్టడం వాడి అలవాటు. ఎందరెన్ని రకాలుగా చెప్పినా వాడు తన అలవాటు మార్చుకోలేకుండా ఉన్నాడు.

ఒకరోజున ఆ ఊరి గ్రామాధికారి మరణించాడు. అంతా చూడ్డానికి వెడుతూ కిష్టప్పనూ రమ్మన్నారు. కిష్టప్ప వారితో, "ఈ ప్రపంచంలో ఏది శాశ్వతం? ఈ రోజు గ్రామాధికారి. రేపు మనం. ఇప్పుడు మనం వెళ్ళి చూస్తే ఆయన బ్రతుకుతాడా? అలాంటప్పుడు వెళ్ళడమెందుకు? గ్రామాధికారి కుటుంబాన్ని సంతోషపెట్టి నా అవసరం గడుపు కోవాలన్న దుర్బుద్ధి నాకు లేదు. నేను రాను" అన్నాడు.

వాడి నోటిదురుసుకు మనసులో బాధపడుతూ వారంతా అక్కణ్ణించి వెళ్ళిపోయారు.

ఇది జరిగిన వారం రోజులకు కిష్టప్ప ఎదురింట్లో ఉండే బంగారయ్య ఇంట్లో దొంగతనం జరిగింది. ఉన్నదంతా పోయిందని బంగారయ్య లబోదిబో మంటూంటే ఊళ్ళో వాళ్ళు ఒకొక్కరే వెళ్ళి ఆయన్ను ఓదార్చుతున్నారు. కిష్టప్ప తను కూడా వెళ్ళి, "ఏదీ శాశ్వతం కాదు. వచ్చినప్పుడు వెంట తెచ్చిందీ లేదు. పోయేటప్పుడు పట్టుకు పోయేదీ లేదు. ఏడ్చి ఏం లాభం? పోయింది పాపిష్టి సొమ్మనుకో. మళ్ళీ కష్టపడి సంపాదించు. అప్పుడు పాపాలు చేయకుండా జాగ్రత్తపడు. ఈ ప్రపంచంలో న్యాయంగా ఆర్జించినది మాత్రమే మనకు దక్కుతుంది" అన్నాడు.

బంగారయ్యకు చాలా కోపం వచ్చింది. కానీ అప్పటికేమీ అనలేక ఊరుకున్నాడు.

కొన్నాళ్ళకు కిష్టప్పకు పట్నంలో పని పడింది. వాడు బంగారయ్య వద్దకు వెళ్ళి, "నేను నగలు చేయించాలి. పట్నం వెడుతున్నాను. నువ్వు నాకు తోడుగా వచ్చి ఈ పనిలో సాయపడితే నీకు పాతిక వరహాలిస్తాను. ఇబ్బందుల్లో ఉన్నావు. నీకు సాయం చేసినట్లుంటుందని రమ్మంటున్నాను"

ఎం. శ్రీనివాస్



అన్నాడు.

నగలు చేయించడంలో బంగారయ్య సిద్ధహస్తుడు. కిష్టప్పకు తన అవసరముందని బంగారయ్యకు అర్థమయింది. ఆయన వెంటనే, "కిష్టప్పా! నేను ఇబ్బందుల్లో ఉన్న మాట నిజం. నాకిస్తానంటున్న పాతిక వరహాలూ ముందుగా ఇస్తే తప్ప నేను నీతో రాలేను" అన్నాడు.

కిష్టప్ప సరేనని ఆయనకు పాతిక వరహాలూ ఇచ్చుకుని వెంటనే ప్రయాణం కమ్మన్నారు. ఇద్దరూ బయల్దేరారు.

పట్నానికి అడవి దారిలో వెళ్ళాలి. ఇద్దరూ కొంత దూరం వెళ్ళేసరికి కిష్టప్పకు కాల్లో ముల్లు దిగింది. వాడు గోల పెడుతూ వెంటనే చతికిల బడి పోయాడు. చూసుకుంటే కాల్లోంచి రక్తం కూడా వస్తోంది.

కిష్టప్ప ముల్లును తీసేసి, "అయ్యో! ఎంత పెద్ద ముల్లో, ఎంత రక్తం పోయిందో" అని బాధపడ్డాడు.

బంగారయ్య నవ్వి "ఈ ప్రపంచంలో ప్రాణమే శాశ్వతం కాదు. కాస్త రక్తంపోతే బాధ పడడమెందుకు? అయినా శరీరంలోంచి చెడురక్తం పోతే లోపల మళ్ళీ మంచి రక్తం తయారవుతుంది. బాధపడితే పోయిన రక్తం తిరిగి లోపలకు ప్రవేశించదు కదా!" అన్నాడు.

కిష్టప్పకు బాధనిపించింది. కానీ అప్పటికి తానెంతమందితోనో అలా మాట్లాడి ఉన్నాడు. బంగారయ్యను తప్పు పట్టలేడు కదా!

అయితే ఆ తర్వాత నడవడానికి కిష్టప్ప చాలా ఇబ్బంది పడ్డాడు. వాడి బాధ చూడలేక బంగారయ్య వాడి బరువును కూడా తనే మోశాడు.

అంతలో చీకటి పడింది. కిష్టప్ప కంగారు పడుతూ, "అసలే దొంగల భయం ఎక్కువగా ఉంది. దానికితోడు చీకటి కూడా పడింది. నువ్వు డబ్బు జాగ్రత్తగా భద్రపరు" అన్నాడు.

"డబ్బు దొంగలకు దక్కనివ్వనులే" అన్నాడు బంగారయ్య.

ఆ తర్వాత అడవిదారి కొంచెంసేపట్లో ముగుస్తుందనగా నలుగురు దొంగలు వచ్చి వాళ్ళిద్దర్నీ అటకాయించారు.

"మమ్మల్నిబ్బంది పెట్టకండి. మా దగ్గర ఏమీ లేదు" అన్నాడు బంగారయ్య.

దొంగలు వాళ్ళిద్దర్నీ వెతికి ఏమీలేదని రూఢీ

చేసుకుని వెళ్ళిపోయారు.

కిష్టప్ప ఆశ్చర్యపడి, "నువ్వు నా డబ్బు నెక్కడ దాచావు? ఎలా దాచావు?" అన్నాడు.

బంగారయ్య నవ్వి "ఆశ్చర్యపడకు. నా దగ్గర నిజంగానే డబ్బు లేదు. దార్లో అవతల పారేశాను" అన్నాడు.

కిష్టప్ప వెంటనే తన డబ్బు పోయిందని ఏడుపు లంకించుకున్నాడు.

"ఎందుకేడుస్తావు? న్యాయంగా సంపాదించిన డబ్బయితే అదెక్కడికీ పోదు. నేను పారేసి ఉండకపోతే దాన్నెలాగూ దొంగలు తీసుకుపోయే వారు. నేను డబ్బుని దొంగలకు దక్కకుండా చేశాను. అయినా ఈ ప్రపంచంలో ఏది శాశ్వతం? పోయేటప్పుడు డబ్బును వెంట తీసుకునిపోవు కదా! ఏడ్చి పోయిన డబ్బు సంపాదించలేవు కదా, ఊరుకో!" అంటూ బంగారయ్య వాణ్ణి ఓదార్చాడు.

కిష్టప్ప అప్పుడు బంగారయ్యను నానా మాటలూ అని తిట్టాడు.

"ఓహో! మాకు చెప్పినప్పుడు వేదాంతం. నీకు చెబితే తిడతావా? నీ డబ్బేంకాలేదు. ఇదంతా నీకు బుద్ధి రావడం కోసం నేనూ, ఈ ఊరివాళ్ళూ ఆడిన నాటకం. ఆ దొంగలు కూడా మనూరివాళ్ళే!" అన్నాడు బంగారయ్య.

అప్పుడు కిష్టప్పకు బంగారయ్య దేవుడిలా కనిపించాడు. వాడు వెంటనే, "బంగారయ్యా! నిజంగానే ఈ ప్రపంచంలో ఏదీ శాశ్వతం కాదు. కానీ నా వంటివాడికి బుద్ధి చెప్పడం కోసం డబ్బు నష్టం కలక్కుండా పాఠం చెప్పిన నీలాంటి వాళ్ళ స్నేహమే శాశ్వతం. ఇన్నాళ్ళూ నేను చేసిన తప్పులకి నన్ను క్షమించు" అన్నాడు.

వాడిలో మార్పు వచ్చిందని బంగారయ్య ఎంతో సంతోషించి, "ఏ స్నేహమైనా శాశ్వతంగా నిలబడేది మాటలతోనే! నీ మాటల నిలాగే మలచుకుని అందరితోనూ శాశ్వత స్నేహాన్ని సంపాదించు" అన్నాడు.



## ఏప్రిల్ నెల

# బొమ్మల సంభాషణ ఫలితాలు



డ్రైవర్: మా ఏరియా ఓట్లన్నీ మీకే వేస్తాం బాబూ! ఇక నన్ను వదిలిపెట్టండీ!
రాజకీయ నాయకుడు: ఓటు వెయ్యమని కాదయ్యా నిన్ను ఆపింది. మీ ఏరియా ఓట్లన్నీ ఎటూ మేమే వేసేసుకుంటాం. ఓటు వేసే ఆ ఛాయలకి రావద్దని హెచ్చరిస్తున్నాను. అంతే!!

— ఆర్.వి రాఘవరావు, కనికిరి.

* * *

పెద్దమనిషి: బజార్లో పూలదండలూ, షాపులో శాలువాలూ కొనుక్కుని, టౌనుహాల్లో జరిగే సన్మానానికి పదినిమిషాల్లో తీసుకుపోతావా?
డ్రైవర్: అలాగేనండీ! ఇంతకీ తమరెవరండీ?
పెద్దమనిషి: అక్కడ సన్మానం జరిగేది నాకేనోయ్!

— సూరి బాల మాధవి, వరంగల్.

* * *

డ్రైవర్: సార్! మీరు ఎలెక్షన్లో ఓడిపోయి, రాజీనామా చేయటానికి వెళుతున్నారు! కారు తాళాలిటివ్వండి!
మంత్రి: రాజీనామా ఇచ్చేది నా పదవికి, కారుకు కాదురా వెధవా!

— బి. భోగేశ్వరరావు, రాజమండ్రి

* * *

డ్రైవర్: ఏమిటి సార్! ట్రాఫిక్ కానిస్టేబుల్ ఉండవలసిన చోట మీరున్నారు?
రాజకీయ నాయకుడు: ఎలక్షన్ జరుగుతున్నది కదయ్యా! ఇప్పుడైనా ప్రజల దృష్టిలో పడకపోతే బాగుండదని.

— బేరా చినబాబు, నర్సీపట్నం.

* * *

కారులో వ్యక్తి: ఎందుకండీ కారు ఆపారు?
అపేక్షకుడు: (ఆదుర్దాగా) ఏంటి నాయనా! అంత స్పీడుగా వెళితే ఎలా? నీకేదైనా ప్రమాదం జరిగి, పైకెళిపోతే నా ఓటు సంగతేంకాను చెప్పు!!

— కె. రామరావ్, శ్రీకాకుళం



# ప్రశ్నలు జవాబులు



**ప్రశ్న: వాషింగ్ పౌడరు లేకుండా బట్టలను శుభ్రపరచడం సాధ్యమా?**

జవాబు: సాధారణంగా బట్టలుతకాలంటే సబ్బు, వేణీళ్ళు వగైరాలుండాలి. అయితే అమెరికాలోని ఫ్లోరిడాలో కొందరు శాస్త్రజ్ఞులు ఓజోన్‌తో బట్టలుతికే కొత్త విధానం రూపొందించారు. సాధారణంగా ఆక్సిజన్లో రెండు ఆక్సిజన్ ఆటమ్సు కలిసి ఉంటాయి. అదే ఓజోన్‌లో అయితే మూడు ఆక్సిజన్ ఆటమ్సు కలిసి ఉంటాయి. ఈ ఓజోన్‌ను తయారుచేయడం చాలా సులభం. ఓజోన్ బట్టల మీద ఎలాంటి మురికి ఉన్నా సరే తొలగించగలదు. మురికి రసాయన పదార్థమే కదా! దాన్నిది ముక్కలు ముక్కలుగా విడగొట్టి బట్టల నుంచి విడిపోయేలా చేస్తుంది. ఈ ఓజోన్ సహాయంతో కొత్త తరహా చాకిరేవును రూపొందిస్తున్నారు. అందులో ఒకదానితో ఒకటి కలుపబడి నీటి డబ్బాలు, ఫిల్టర్లు, పంపులు ఉంటాయి. ఒక ఓజోన్ జెనరేటరు, ఇంజక్టరు ఉంటాయి. నీళ్ళలోకి ఓజోన్ పంపేక - ఓజోన్ కలసిన నీళ్ళు బట్టలలోంచీ ప్రవహిస్తూ - మురికిని తొలగిస్తాయి. మురికి కలిసిన నీరు వెనక్కు పంపు చేయబడుతుంది. అక్కడ శుభ్రపర్చబడిన నీరు తిరిగి నీటి డబ్బాలను చేరుకుంటుంది. మామూలుగా అయితే అర కిలో బట్టల్ని శుభ్రం చేయడానికి 11 లీటర్లు నీరుండాలి. ఈ ఓజోన్ పద్ధతిలో ఒకటిన్నర లీటర్లు చాలు. వాతావరణ కాలుష్యం లేకుండా బట్టల్ని శుభ్రపరిచే ఈ పద్ధతిలో ఇంకో విశేషం — ఉతకడానికి చన్నీళ్ళు చాలు, వేణ్ణీళ్ళక్కర్లేదు.

**ప్రశ్న: మచ్చలేకుండా శస్త్ర చికిత్స సాధ్యమా?**

జవాబు: శస్త్రచికిత్సవల్ల శరీరంపై కత్తికోత పడుతుంది. తర్వాత కుట్లు. అందువల్ల ఆ ప్రాంతంలో మచ్చ ఏర్పడి శాశ్వతంగా ఉండిపోతుంది. కానీ ఇది మామూలు మనుమల విషయంలోనే! గర్భస్థ శిశువు వంటి మీద కత్తికోత పడినా తర్వాత మచ్చ ఏర్పడదట. ఈ విషయాన్ని వెయ్యి గొర్రెల మీద, వంద కోతుల మీద ప్రయోగాలు చేశాక డాక్టర్లు ధృవపర్చుకుని ఇప్పుడు మనుమల మీద కూడా చేయగలమని నమ్మకంగా చెబుతున్నారు. శిశువు గర్భంలో ఉండగా గ్రహణంవల్ల కొన్ని అవలక్షణాలు ఏర్పడే అవకాశముంది. ఇంతవరకూ శిశువు పుట్టేక శస్త్ర చికిత్సతో ఆ లోపాలను సవరించడం జరుగుతోంది. కానీ అందువల్ల ముఖం మీద శాశ్వతంగా మచ్చ ఉండిపోతోంది. గర్భస్థ శిశువు లోపాలు స్కానింగు ద్వారా తెలుసుకునే ఏర్పాటుందిప్పుడు. డాక్టర్లు శస్త్రచికిత్స చేసి గర్భస్థ శిశువును బయటకు తీస్తారు.

"వసుంధర"

శస్త్రచికిత్సతో శిశువు లోపాలు సవరించేక తిరిగి ఆ శిశువును గర్భంలో యధాస్థానంలో ఉంచుతారు. శిశువు ఏ లోపాలూ, మచ్చలూ లేకుండా జన్మిస్తుంది. గర్భస్థ శిశువుకు శస్త్రచికిత్స జరిగితే మచ్చలెందుకు ఏర్పడవో - ఆ రహస్యం తెలిస్తే - బయటకూడా మచ్చలు లేని శస్త్రచికిత్స సాధ్యం. డాక్టర్లీ విషయమై తీవ్ర ప్రయత్నాలు చేస్తున్నారు.

**ప్రశ్న: ఇటీవల నాగపూర్‌లో జరిగిన వన్డే ఇంటర్నేషనల్ క్రికెట్ మ్యాచి ప్రత్యేకత ఏమిటి?**

జవాబు: న్యూజిలాండుకూ, భారతదేశానికీ మధ్య ఆ సీజనులో జరగాల్సిన ఆరు వండే ఇంటర్నేషనల్ క్రికెట్ మ్యాచిలలో అది అయిదవది. భారతజట్టు కెప్టెన్ అజరుద్దీన్ దాంతో కెప్టెన్‌గా నూరు మ్యాచిలు పూర్తి చేసుకున్నాడు. భారతజట్టు వైస్‌కెప్టెన్ సచిన్ టెండూల్కర్‌కు అది నూరవ మ్యాచి. న్యూజిలాండు జట్టులోని బ్యాట్సుమన్ భారత బౌలర్లను చిత్తుచేసి 50 ఓవర్లలో 348 పరుగులు చేశారు - ఎనిమిది వికెట్ల నష్టానికి. మన నేల మీద వన్డేలలో ఇంత పెద్ద స్కోరు ఇదే మొదటిసారి. ప్రపంచం మొత్తం మీద వన్డేలను తీసుకుంటే 50 ఓవర్ల మ్యాచిలలో ఈ స్కోరుది రెండవ స్థానం. 60 ఓవర్ల మ్యాచిలను కూడా తీసుకుంటే ఈ స్కోరుది మూడవస్థానం. భారతజట్టు 40 ఓవర్లలోపులోనే 249 పరుగులకు అందరూ అయిపోగా ఓడిపోయింది. రిలయన్స్ వరల్డ్ కప్ వన్డే ఇంటర్నేషనల్ పోటీలో ఇదే చోట భారతజట్టు న్యూజిలాండు బౌలర్లను చిత్తు చేసింది — 1987లో. అందుకు ప్రతీకారం ఈసారి న్యూజిలాండు బ్యాట్స్‌మన్ తీర్చుకున్నారు. ఈ మ్యాచితో రెండు జట్లూ చెరి రెండు విజయాలనూ సాధించి సరిసమానమయ్యారు. ఇదిలా ఉండగా లంచి సమయంలో జనం తోడతొక్కిడికి స్టేడియంలో కొత్తగా కట్టిన గోడ ఒకటి కూలి తొమ్మండుగురు మరణించారు. అలా పోయిన వారిలో నాగపూర్ మెడికల్ కాలేజిలో మెడిసిన్ పూర్తి చేయనున్న ఒక ఆంధ్ర యువతి కూడా ఉంది.



## బొమ్మల సంభాషణ

ఈ బొమ్మలోని వాళ్ళు ఏం మాట్లాడుకుంటే నవ్వు వస్తుందో, ఆ సంభాషణ వ్రాసి, ఈ సంచిక విడుదలైన పది రోజులలోగా మాకు పంప కోరు తున్నాం. బాగున్న అయిదింటిని ఎన్నుకొని, ఒక దానికి రూ. 15/- పంపుతాం. సంభాషణలు కార్డు మీద మాత్రమే వ్రాసి పంపాలన్నది షరతు.

**బొమ్మల సంభాషణ**
*80, ధనలక్ష్మీ కాలనీ, వడపళని, మద్రాసు - 26*

Edited and published by Vijaya Bapineedu, 80, Dhanalakshmi Colony, Madras - 26. Phone: 4844499 and Printed by N. Navin Chandran, at S.R. Offset Art Printers, Madras - 21. Phone: 5226462.

